

స్వాతంత్ర్య దినోత్సవంనాడు హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్రయొక్క ప్రథమ సంపుటం ప్రచురింపబడిన సందర్భంలో శ్రీ గోపాలరావు ఎక్బోటే ప్రసంగిస్తున్నారు.

[దిగువ] హైదరాబాదు సంస్కృత విశ్వపరిషత్తు ఆధ్వర్యాన *1956* జులై *22* తేదీన వ్యాస దినోత్సవం జరుపబడింది. ఆ సభకు అధ్యక్షతవహించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ డా. యస్. భగవంతం ప్రసంగిస్తున్నారు.



# విషయ సూచిక





ముఖచిత్రం :

హైద్రాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర యొక్క మొదటి సంపుటమును స్వాతంత్ర్య దినోత్సవం నాడు రాష్ట్ర విద్యామంత్రి : శ్రీ గోపాలరావు ఎక్బోటే ముఖ్యమంత్రిగారికి సమర్పించారు.



వెనుకకవరు :

గడచిన జులై 29 వ తేదీన హైదరాబాదులో ఉన్ని పనివారల మహాసభ జరిగినప్పటి దృశ్యం.

హైదరాబాదు పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# TOWARDS
# A
# WELFARE STATE

●

*Progress of the*

## FIRST
## FIVE-YEAR PLAN
*IN*
## HYDERABAD

●

PRICE: Rs. 2-0-0

*Obtainable from:*

**THE DEPARTMENT OF INFORMATION & PUBLIC RELATIONS,**
**HYDERABAD. 1 (Dn)**

# * మూడు భాషా ప్రాంతాలు

తేది ...... 



*హైదరాబాదు రాష్ట్రంలోని మూడు భాషా ప్రాంతాలు కొన్ని శతాబ్దాలనుంచి ఏక పరిపాలన క్రింద ఉంటూ వచ్చాయి. వచ్చే నవంబరు ౧ వ తేదీనుంచి వీటిని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాన్ననుసరించి పరిసర రాష్ట్రాలలో లీనం చేయడమవుతున్నది. ఈ మూడు ప్రాంతాల ప్రత్యేకతలు, వాటి స్థితిగతులు, వాటిలో ఇటీవల అమలు జరుగుతూ వున్న అభివృద్ది కార్యక్రమాలు ఈ దిగువ వివరించబడుతున్నవి.*

## తెలంగాణా

ఆంధ్ర రాష్ట్రంలో విలీనం చేయబడుతున్నట్టి తెలంగాణా ప్రాంతంలో తొమ్మిది జిల్లాలున్నవి. ౧. హైద్రాబాదు, ౨. మహబూబునగర్, ౩. ఆదిలాబాదు, ౪. నిజామాబాదు, ౫. మెదకు, ౬. కరీంనగర్, ౭. వరంగలు, ౮. ఖమ్మంమెట్టు, ౯. నల్లగొండ. ఈ తొమ్మిది జిల్లాలేగాక బీదరు జిల్లాలోని నారాయణ్‌ఖేడ్, జహీరాబాదు తాలూకాలు; రాయచూరు జిల్లాలోనిగద్వాల, ఆలంపూరు తాలూకాలు; గుల్బర్గా జిల్లాలోని తాండూరు, కొడంగల్ తాలూకాలు కూడా తెలంగాణా ప్రాంతంక్రిందికే వస్తున్నవి. ఈ ప్రాంతపు మొత్తం విస్తీర్ణం ౪౩,౨౮౨.౪ చదరపుమైళ్లు. దీని జనాభా ౧౦,౭౬౧,౦౦౦ అంటే ప్రతి చదరపుమైలుకు ౨౪౯ మంది నివసిస్తున్నారన్న మాట.

మొత్తం తాలూకాలు ౭౦, రెవిన్యూ ఫిర్కాలు ౩౭౦, గ్రామాలు పట్టణాలు ౧౦,౭౬౦. వీటిలో లక్ష లేక అంతకు మించిన జనాభాగల ప్రథమశ్రేణికి చెందిన పట్టణాలు ౨. ౫౦ వేలు మొదలు ఒక లక్షలోపు జనాభాగల రెండవశ్రేణి పట్టణాలు ౨.

జనాభాలో పురుషుల సంఖ్య ౫౪,౩౫,౦౦౦: స్త్రీల సంఖ్య ౫౩,౨౫,౦౦౦. అంటే ప్రతి వెయ్యిమంది పురుషులకు ౯౭౯ మంది స్త్రీలున్నారన్న మాట.

పట్టణముల జనాభా ౨౨,౩౬,౦౦౦. గ్రామాల జనాభా ౮౫,౨౪,౦౦౦.

ఈ ప్రాంతంలో తెలుగు మాట్లాడు వారి సంఖ్య ౮౪,౭౪,౦౦౦. అంటే నూటికి ౭౮.౭ వంతులు మంది తెలుగు మాట్లాడేవారున్నారు. మరాటీ మాట్లాడువారిసంఖ్య ౨,౮౮,౦౦౦. అంటే నూటికి ౨·౭ వంతులమంది. ఉర్దూ మాట్లాడువారి సంఖ్య ౧౧,౭౦,౦౦౦. అంటే నూటికి ౧౦·౯ వంతులమంది. కన్నడము మాట్లాడువారి సంఖ్య ౧,౦౩,౦౦౦ అంటే నూటికి ౧ వంతు. ఇతర భాషలు మాట్లాడువారి సంఖ్య ౭,౨౫,౦౦౦ అంటే నూటికి ౬·౭ వంతుల మంది.

వ్యవసాయంపై ఆధారపడివున్న జనాభా ౬౫,౮౦,౦౦౦. అంటే నూటికి ౬౧·౧ వంతులన్నమాట. వ్యవసాయేతరములైన వృత్తులపై ఆధారపడివున్నవారి సంఖ్య ౪౧,౮౧,౦౦౦. అంటే నూటికి ౩౮·౯ వంతులు.

ఈ ప్రాంతంలో ప్రతియేటా సగటువర్షపాతం ౩౪.౯౦ అం. అడవి ప్రాంతం ౬౮,౬౯,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౨౪.౮ వంతులు. పైరులువేయబడుభూమి ౧,౧౪,౧౫,౦౦౦ ఎకరాలు. అంటే ౪౧·౨ వంతులు. సేద్యయోగ్యం కాకుండా పడావా పడివున్న భూమి ౨౫,౩౯,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౯·౨ వంతులు.

వ్యవసాయేతర పనులకు ఉపయోగించబడు భూమి ౧౩,౭౨,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౫ వంతులు,

సేద్యయోగ్యం అయివుండి కూడా సాగుచేయబడకుండా వున్న భూమి ౧౦,౦౬,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౩·౬ వంతులు.

మిగిలిన భూమిలో పచ్చికబయళ్లు, వివిధములైన చెట్లు, పైరులు, తోపులు ఉన్నవి. లేదా బంజరుభూమి.

వివిధ జలాధారములవల్ల నికరంగా సాగుచేయబడు భూమి ౧౮,౬౭,౩౦౦ ఎకరాలు. ఇందులో ౧౦,౩౦,౭౦౦ ఎకరాలు చెరువుల వల్ల సాగు అవుతున్నది. ౩,౩౩,౩౦౦

ఎకరాలు బావులవల్ల సాగు అవుతున్నది. ౨,౪౭,౦౦౦ ఎకరాలు ప్రభుత్వం త్రవ్వించిన కాలువలవల్ల సాగు అవుతున్నది. ౭,౨౦౦ ఎకరాలు ప్రయివేటు కాలువలవల్ల సాగు అవుతున్నది. ఇతర జలాధారములవల్ల ౪౯,౧౦౦ ఎకరాలు సాగు అవుతున్నవి.

పైరులు వేయబడు మొత్తం భూమి ౧,౧౬,౮౫,౦౦౦ ఎకరాలు. ఇందులో ఆహారధాన్యముల క్రింద ౬౬,౫౩,౦౦౦ ఎకరాల భూమి ఈ దిగువ వివరించిన విధంగా కలదు :

వరి : ౧౭,౪౦,౦౦౦ ఎకరాలు, జొన్న ౩౨,౮౫,౦౦౦ ఎకరాలు, గోధుమ ౩౫,౦౦౦ ఎకరాలు, సజ్జ ౫,౦౮,౦౦౦ ఎకరాలు, మొక్కజొన్న ౪,౪౩,౦౦౦ ఎకరాలు, రాగులు ౧,౫౦,౦౦౦ ఎకరాలు, పప్పుధాన్యముల పైరుల క్రింద ౧౭౫౩,౦౦౦ ఎకరాలు చెరుకుపైరు క్రింద ౫౬,౦౦౦ ఎకరాలు, నూనెగింజల పైరులక్రింద ౨౪,౫౬,౦౦౦ ఎకరాలు, ప్రత్తి పంట క్రింద ౩,౨౩,౦౦౦ ఎకరాలు, పొగాకుక్రింద ౩౧,౦౦౦ ఎకరాలు.

ప్రతియేటా వడ్లు ౫,౩౨,౦౦౦ టన్నులు, జొన్నలు ౪,౬౬,౬౦౦ టన్నులు, సజ్జలు ౩౨,౭౦౦ టన్నులు, గోధుమ ౪,౧౦౦ టన్నులు, మొక్కజొన్న ౬౬,౯౦౦ టన్నులు, రాగులు ౧౭,౨౦౦ టన్నులు, ఉలవలు ౨౫,౪౦౦ టన్నులు, కందులు ౨౫,౭౦౦ టన్నులు, పెసలు ౪౪,౧౦౦ టన్నులు, వేరుసెనగ ౨,౪౨,౨౦౧ టన్నులు, ఆముదాలు ౫౧,౩౦౦ టన్నులు, ప్రత్తి ౩౯,౬౦౦ బేళ్లు, చెరుకు ౧,౩౬,౨౦౦ టన్నులు, పొగాకు ౮,౫౦౦ టన్నులు పండుతున్నవి.

ప్రతి ఎకరాలో పంటల సగటు దిగుబడి ఈ విధంగా ఉన్నది. వడ్లు ౬౮౫ పౌనులు, గోధుమలు ౨౬౨ పౌనులు, జొన్నలు ౩౧౮ పౌనులు, వేరుసెనగ ౫౨౪ పౌనులు, ఆముదాలు ౧౫౬ పౌనులు, చెరకు (బెల్లపుది) ౫,౪౪౫ పౌనులు, ప్రత్తి (ఏకుడు దూది) ౪౮ పౌనులు, పొగాకు ౬౧౬ పౌనులు.

ఈ ప్రాంతంలో దుక్కి దున్నుటకు పనికివచ్చే పశువుల సంఖ్య ౨౨,౭౭,౦౦౦. నాగళ్ళమొత్తంసంఖ్య ౧౨,౨౦,౦౦౦ బండ్ల మొత్తం సంఖ్య ౪,౨౦,౦౦౦, ఎడ్లు, ఆవుల సంఖ్య ౪౮,౫౪,౦౦౦, గేదెలు,దున్నపోతులసంఖ్య ౧౬,౩౮,౦౦౦, కోళ్లు ఇతర పక్షిజాతుల సంఖ్య ౩౧,౭౭,౦౦౦, గొర్రెల సంఖ్య ౩౬,౧౫,౦౦౦ మేకల సంఖ్య ౧౫,౩౨,౦౦౦.

వివిధ గనులలో ప్రతిదినం సగటున నియమింపబడు కార్మికుల సంఖ్య ౧౯,౭౦౫.

ప్రతియేటా ఖనిజముల ఉత్పత్తి వివరములు ఇవి : బొగ్గు ౧౫,౯౭ లక్షల టన్నులు, ముడిఇనుము ౩౯,౭౦౦టన్నులు, సున్నపురాయి ౧,౦౩,౧౦౦ టన్నులు, బైరైట్ ౮౦టన్నులు క్వార్ట్జురాయి ౩౭౦౦ టన్నులు, ఫ్లెస్పార్ ౧౨౦౦టన్నులు, గ్రాఫైట్ ౩౦ టన్నులు, క్రోమైట్ ౭౦ టన్నులు.

ఈ ప్రాంతంలో ౭౩౮ భారీ పారిశ్రామిక సంస్థలున్నవి. వీనిలో ప్రతిరోజు సగటున ౪౮౦౦౦మంది వ్యక్తులు పనిచేస్తూ ఉంటారు. స్వల్పకుటీరపరిశ్రమల సంస్థలసంఖ్య ౧,౭౧,౦౦౦. వీనిలో ప్రతిరోజు సగటున ౫,౨౦,౦౦౦ మంది వ్యక్తులు పనిచేస్తూ ఉంటారు.

ప్రతియేటా ౪,౧౫,౨౦,౦౦౦గజముల వస్త్రము, ౧,౨౮, ౩౬,౦౦౦ పౌనుల నూలు, ౯,౬౧,౦౦౦ టన్నుల చక్కెర, ౨,౬౮,౦౦౦ హండ్రెడ్ వెయిట్ల కాగితము, ౪౭౩, ౭౯,౦౦,౦౦౦ సిగరెట్లు, రేయన్ నూలు ౨౫.౭౮ లక్షల పౌనులు, రేయన్ వస్త్రం ౯.౩౭లక్షల గజములు, విద్యుచ్ఛక్తి ౬,౫౭,౨౭,౦౦౦ కిలోవాట్లు, సారాయి ౩,౬౭,౦౦౦ యల్. పి. గ్యాలనులు, గాజు సామగ్రి ౧,౩౯౯ టన్నులు, రసాయనిక ఎరువులు, ఎముకలపొడి ౧౨౧౫౬ టన్నులు ఉత్పత్తి అవుతాయి.

భారీ పరిశ్రమలలో పనిలోకి రాకుండా గైర్‌హాజరు అగు వారు నూటికి ౧.౬ వంతుల చొప్పున ఉంటారు.

క్రమబద్ధం చేయబడిన మార్కెట్లు ౩౭ కలవు.

సహకార బ్యాంకులు ౧౫, వ్యవసాయ సహకార సంఘములు ౬,౭౫౦, వ్యవసాయేతర సహకార సంఘములు ౮౮౬ కలవు.

పి. డబ్ల్యు. డి. రోడ్ల మైళ్ల నిడివి ౪,౧౫౮ మైళ్లు.

ఆర్. టి. డి. బస్సులు, సరుకుల బండ్లుగాక, రిజిస్టరైన మోటారు బండ్ల మొత్తం సంఖ్య ౧౧,౩౧౨. డ్రైవింగు లైసెన్సులు ౬,౩౭౫ ఇవ్వబడినవి. ఈ ప్రాంతంలో ౨,౦౬౭ తపాలాఫీసులు, ౫౯ టెలిగ్రాఫ్ ఆఫీసులు కలవు.

నివేశన గృహముల సంఖ్య ౧౯,౬౮,౦౦౦.

ప్రాథమిక పాఠశాలల సంఖ్య ౭.౪౨౨, విద్యార్థులసంఖ్య ౪,౬౩,౫౫౫, ఉపాధ్యాయుల సంఖ్య ౧౭౮౭.

౧౫౦ మాధ్యమిక పాఠశాలలు, ౧౦౬ ఉన్నత పాఠశాలలు, ౨౫ ప్రత్యేక వృత్తి విద్యాపాఠశాలలు, ౧౫ ఆర్ట్సు, సైన్సు కళాశాలలు, ౭ వృత్తి కళాశాలలు కలవు.

౨౬ ఆసుపత్రులు కలవు. ప్రభుత్వ చికిత్సాలయముల సంఖ్య ౧౮౫, ప్రభుత్వ డాక్టర్లు ౪౯౦ మంది ఉన్నారు. అలోపతిక్ ఆసుపత్రులలో మంచముల సంఖ్య ౪,౩౦౭.

ఆర్థిక రీత్యా పని పాటలలో నిమగ్నమై వున్న వారు, స్వయం పోషకులు, ఆర్జిస్తూ కూడా ఆశ్రితులుగా వున్నవారు మొత్తం ౫౦,౦౫,౦౦౦ మంది ఉన్నారు.

* * *

## సామాజికాభివృద్ధి

తెలంగాణా ప్రాంతంలో ప్రథమ ప్రణాళిక ముగిసే నాటికి ౧౧ సామాజికాభివృద్ధి కేంద్రాలు పనిచేస్తూ వున్నవి. వీనిలో రెండు కేంద్రాలు నిజాంసాగర్ ప్రాంతంలో, ఒకటి నిజామాబాదులో, మిగిలిన ఎనిమిది ములుగు, వికారాబాదు, పటన్ చెర్వు, బీదరు, జహీరాబాదు, దేవరకొండ, మిర్యాలగూడెం, వైరాలలో ఒక్కొక్కటి చొప్పున ఉన్నవి.

ఈ ౧౧ కేంద్రాల క్రింద ౧,౨౫౮ గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం ౨౬,౩౫,౨౭౩ ఎకరాలు, జనాభా ౧౦,౬౧,౬౪౪.

ప్రథమప్రణాళిక ముగిసేనాటికి తెలంగాణాలో ౧౦ జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు పనిచేస్తున్నవి. ఇవి సదాశివపేట, పెద్దపూరు, పాలేరు, పశ్చిమ హైద్రాబాదు, తూర్పు హైద్రాబాదు, మెట్టుపల్లి, షాద్‌నగర్, ఆదిలాబాదు, కరీంనగర్ (గంగాధ్ర), కల్వకుర్తి ప్రాంతాలలో ఒక్కొక్కటి చొప్పున ఉన్నవి.

ఈ పది కేంద్రాల క్రింద ౧౦౬౦ గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం ౨౨,౬౦,౨౪౫ ఎకరాలు. జనాభా ౯,౩౪,౧౩౨.

ఈ సంవత్సరం హైదరాబాదు, కరీంనగర్, మహబూబునగర్, ఆదిలాబాదు, వరంగలు, ఖమ్మం, మెదకు, నల్లగొండ జిల్లాలలో మరి ఎనిమిది జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు ప్రారంభింపబడినవి.

స్థానిక అభివృద్ధి పనుల పథకం క్రింద తెలంగాణా జిల్లాలలో ౧౯౫౪-౫౫ సంవత్సరంలో పెట్టబడిన ఖర్చు వివరాలు దిగువ విధంగా ఉన్నవి : ఆదిలాబాదు రూ. ౮౯,౧౧౧, హైద్రాబాదు రూ. ౨౪,౩౫౦, ఖమ్మం రూ. ౩౦,౦౯౮, కరీంనగర్ రూ. ౧౬,౦౦౦, మహబూబునగర్ రూ. ౫౮,౦౪౫, మెదకు రూ. ౫౬,౦౮౦, నల్లగొండ రూ. ౧,౯౩,౦౩౨, నిజామాబాద్ రూ. ౧౩,౯౭౨, వరంగలు రూ. ౫౧,౧౪౪.

సామాజికాభివృద్ధి కేంద్రాలకు, జాతీయ విస్తరణ సేవా కేంద్రాలకు అవసరమైన ఉద్యోగులకు శిక్షణ ఇచ్చే నిమిత్తమై అనేక శిక్షణకేంద్రాలు నడుపబడినవి. ఈ కేంద్రాలకు ప్రథమ ప్రణాళిక కాలంలో పెట్టబడిన ఖర్చు వివరములు ఈదిగువ విధంగా ఉన్నవి :

౧. ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ కేంద్రం, హిమాయత్ సాగర్ రూ. ౪,౪౨,౧౧౦.

( దీనికి రెండవ ప్రణాళికలో కేటాయింపబడిన డబ్బు రూ. ౫,౫౨,౫౦౦ )

౨. ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాల, హిమాయత్ సాగర్ రూ. ౧,౩౧,౭౬౯.

( దీనికి రెండవ ప్రణాళికలో కేటాయింపబడిన డబ్బు రూ. ౨,౮౬,౦౦౦ )

౩. హిమాయత్ సాగర్ ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగు కేంద్రానికి అనుబంధంగా వున్న గృహశాస్త్ర విభాగం రూ. ౮౨,౯౭౭.

( రెండవ ప్రణాళికలో దీనికి రూ. ౧,౪౦,౦౦౦ లు కేటాయింపబడినవి )

౪. హిమాయత్ సాగర్ ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగు కేంద్రానికి అనుబంధంగా వున్న వర్కుషాపు రూ. ౩౬,౪౭౦.

( రెండవ ప్రణాళికలో దీనికి రూ. ౧,౭౦,౦౦౦ లు కేటాయింపబడినవి. )

౫. హిమాయత్ సాగర్‌లో గ్రూప్ లెవల్ వర్కర్లకు శిక్షణ పథకం రూ. ౨౫,౦౦౦.

( రెండవ ప్రణాళికలో దీనికి రూ. ౫౭,౧౦౦ లు కేటాయింపబడినవి.

నిజామాబాదు జిల్లాలోని రుద్రూరులో ఉన్న ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలకు రెండవప్రణాళికలో రూ ౩,౩౨,౦౦౦ కేటాయింపబడినవి.

తెలంగాణా ప్రాంతంలో సామాజికాభివృద్ధికి రెండవ ప్రణాళికలో రూ. ౫౧౫.౮౫ లక్షలు కేటాయింపబడినవి.

తెలంగాణా ప్రాంతానికి రెండవ ప్రణాళిక మొత్తానికి రూ. ౫౩.౮ కోట్ల వ్యయం తలపెట్టబడింది.

## మరాట్వాడా

నూత్న బొంబాయి రాష్ట్రంలో విలీనం చేయబడుతున్న మరాట్వాడా ప్రాంతంలో అయిదు జిల్లాలున్నవి.

౧. ఔరంగాబాదు, ౨. పర్భనీ, ౩. నాందేడు, ౪. బీడ్, ౫. ఉస్మానాబాదు. ఈ అయిదు జిల్లాలేగాక బీదరు జిల్లాలోని అహ్మద్‌పూర్, ఉద్గీర్, నిలంగా తాలూకాలు కూడా మరాట్వాడా ప్రాంతం క్రిందకే వస్తున్నవి.

మరాట్వాడా ప్రాంతపు మొత్తం విస్తీర్ణం ౨౪,౭౨౯.౭ చదరపుమైళ్లు, దీని జనాభా ౫౧,౮౬,౨౯౧. అంటే ప్రతి చదరపు మైలుకు ౨౧౭ మంది నివసిస్తున్నారన్నమాట.

మొత్తం తాలూకాలు ౪౬. రెవిన్యూ ఫిర్కాలు ౧౫౭. రెవిన్యూ గ్రామాలు, పట్టణాలు ౮,౫౦౦. వీటిలో ఒక లక్షకు మించిన జనాభాగల మొదటి శ్రేణి పట్టణాలు లేవు. ౫౦ వేల జనాభాకు మించిన రెండవశ్రేణి పట్టణాలు మూడు కలవు.

జనాభాలో పురుషుల సంఖ్య ౨౬,౨౯,౦౦౦. స్త్రీల సంఖ్య ౨౫,౪౭,౦౦౦. అంటే ప్రతి వెయ్యిమంది పురుషు

లకు ౯౬౯ మంది స్త్రీలున్నారన్న మాట. గ్రామాల జనాభా ౪౪,౫౪,౦౦౦.

పట్టణాల జనాభా ౭,౨౨,౦౦౦.

ఈ ప్రాంతంలో మరాటీ మాట్లాడువారి సంఖ్య ౪౦,౮౨,౦౦౦. అంటే నూటికి ౭౮·౯ వంతులమంది మరాటీ మాట్లాడే వారున్నారు. తెలుగు మాట్లాడువారి సంఖ్య ౧,౭౭,౦౦౦. అంటే నూటికి ౩·౪ వంతులమంది. ఉర్దూ మాట్లాడువారి సంఖ్య ౫,౯౫,౦౦౦. అంటే నూటికి ౧౧.౫ వంతులమంది. కన్నడం మాట్లాడే వారి సంఖ్య ౯౦,౦౦౦ అంటే నూటికి ౧.౭ వంతులమంది. ౨,౩౨,౦౦౦ మంది అంటే నూటికి ౪·౫ వంతులమంది ఇతర భాషలు మాట్లాడు వారు కలరు.

మొత్తం జనాభాలో ౪౦,౩౨,౦౦౦ మంది అంటే నూటికి ౭౭·౯ వంతులమందికి వ్యవసాయముపైననూ, ౧౧,౪౪,౦౦౦ మంది అంటే నూటికి ౨౨.౧ వంతులమంది వ్యవసాయేతర ములైన పనులపైనను ఆధారపడివున్నారు.

సంవత్సరపు సగటు వర్షపాతం ౩౪·౯౯ అంగుళాలు.

ఈ ప్రాంతంలో ౫,౬౮,౦౦౦ ఎకరాల మేరకు అడవులు కలవు. అంటే మొత్తం ప్రాంతంలో ౩·౬ వంతులు అడవులు కలవన్న మాట.

పైరులు వేయబడు మొత్తం భూమి ౧,౧౫,౬౨,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౭౨·౭ వంతులు అన్న మాట.

సేద్యయోగ్యంగాకుండా పడావా పడివున్న భూమి ౨,౧౦,౦౦౦ ఎకరాలు; అంటే నూటికి ౧·౩ వంతులు వ్యవసాయేతర పనులకు ఉపయోగింపబడు భూమి ౪,౩౬,౦౦౦ ఎకరాలు అంటే నూటికి ౨·౭ వంతులు. సేద్య యోగ్యం అయివుండికూడా సాగుచేయబడకుండా ఉన్న భూమి ౧,౮౭,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౧·౨ వంతులు. మిగిలిన భూమిలో పచ్చిక బయళ్లు, వివిధములైన చెట్లు, పైరులు, తోపులు ఉన్నవి.

వివిధ జలాధారములవల్ల సాగుచేయబడు మొత్తం భూమి ౩,౪౬,౫౦౦ ఎకరాలు. ఇందులో ౧౦,౭౦౦ ఎకరాలు చెరువులవల్ల సాగు అవుతున్నది. ౨,౬౦,౨౦౦ ఎకరాలు బావులవల్ల సాగు అవుతున్నది. ౩,౫౦౦ ఎకరాలు ప్రభుత్వం త్రవ్వించిన కాలువలవల్ల సాగు అవుతున్నవి. ఇతర జలాధార ములవల్ల ౫,౦౦౦ ఎకరాలు సాగు అవుతున్నవి.

పైరులు వేయబడు మొత్తం భూమి ౧,౧౯,౨౨,౦౦౦ ఎకరాలు. ఇందులో ౫౩,౭౩,౦౦౦ ఎకరాలలో ఆహార ధాన్యాలు పండించబడుతున్నవి. ౧,౨౪,౦౦౦ ఎకరాలలో వరి, ౩౮,౬౫,౦౦౦ ఎకరాలలో జొన్నలు, ౫,౪౧,౦౦౦ ఎకరాలలో గోధుమలు, ౭,౩౭,౦౦౦ ఎకరాలలో సజ్జలు, ౧౫,౦౦౦ ఎకరాలలో మొక్కజొన్నలు, ౫,౦౦౦ ఎకరాలలో రాగులు పండించబడుతున్నవి. ౨౪,౪౨,౦౦౦ ఎకరాలు పప్పు ధాన్యాల సేద్యం క్రిందనూ, ౨౨,౦౦౦ ఎకరాలు చెరకు సేద్యం క్రిందనూ, ౧౮,౨౧,౦౦౦ ఎకరాలు నూనె గింజల సేద్యం క్రిందనూ, ౧౮,౯౬,౦౦౦ ఎకరాలు ప్రత్తి సేద్యం క్రిందనూ, ౩,౦౦౦ ఎకరాలు పొగాకు సేద్యం క్రిందను కలవు.

ప్రతియేటా వడ్లు ౩౦,౪౦౦ టన్నులు, జొన్నలు ౬,౯౧,౬౦౦ టన్నులు, సజ్జలు ౭౬,౮౦౦ టన్నులు, గోధుమలు, ౮౧,౭౦౦ టన్నులు, మొక్కజొన్న ౨,౩౦౦ టన్నులు రాగులు ౫౦౦ టన్నులు, ఉలవలు ౭౩,౫౦౦ టన్నులు, కందులు ౭౫,౬౦౦ టన్నులు, పెసలు ౬౦,౩౦౦ టన్నులు, వేరుసెనగ ౩,౫౮,౮౦౦ టన్నులు, ఆముదాలు ౭౦౦ టన్నులు, ప్రత్తి ౩,౦౦,౧౦౦ బేళ్ళు, చెరకు ౩౭,౭౦౦౦ టన్నులు, పొగాకు ౭౦౦టన్నులు పండుతున్నవి. ప్రతిఎకరాలో పంటల సగటు దిగుబడి ఈ విధంగావున్నది. వడ్లు ౫౪౮ పౌనులు, గోధుమలు ౩౩౯ పౌనులు, జొన్నలు ౪౦౧ పౌనులు, వేరు సెనగ ౮౦౯ ఫౌనులు, ఆముదాలు ౧౫౦ పౌనులు, చెఱకు (బెల్లం) ౩,౭౮౯ పౌనులు, ప్రత్తి (ఏకుడు దూది) ౬౨ పౌనులు, పొగాకు ౫౬౬ పౌనులు.

ఈ ప్రాంతంలో దుక్కి దున్నుటకు పనికి వచ్చే పశువుల సంఖ్య ౧౨,౫౪,౦౦౦. మొత్తం ౨,౪౬,౦౦౦ నాగళ్లు, ౨,౧౮,౦౦౦ బండ్లు కలవు. మొత్తం ౨౮,౮౯,౦౦౦ ఎద్దులు ఆవులు, ౬,౩౦,౦౦౦ గేదెలు, ౫,౨౫,౦౦౦ కోళ్లు, ౬,౧౮,౦౦౦ గొర్రెలు, ౯,౪౬,౦౦౦ మేకలు కలవు.

వివిధ గనులలో ప్రతిదినం సగటున నియమింపబడు కార్మికుల సంఖ్య ౩౭.

౨౦౬ భారీ పారిశ్రామిక సంస్థలు కలవు. వీటిలో ప్రతి రోజు సగటున ౧౮,౦౦౦ మంది పనివారలు నియమించ బడుతున్నారు. ౨౮,౦౦౦ స్వల్పకుటీర పరిశ్రమల సంస్థలు కలవు. వీటిలో ప్రతిరోజున సగటున ౮౯,౦౦౦ మంది కార్మికులు నియమించబడున్నారు.

ప్రతి యేటా ౩,౨౭,౧౮,౦౦౦ గజముల వస్త్రములు, ౧,౦౩,౧౩,౦౦౦ పౌనుల నూలు, ౨౬,౪౮,౦౦౦ కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతున్నది. భారీ పరిశ్రమలలో పని లోకి రాకుండా గైర్‌హాజరు అగువారు నూటికి ౧౩ వంతుల మంది.

క్రమబద్ధమైన మార్కెట్లు ౨౬ కలవు.

సహకార బ్యాంకులు ౯, వ్యవసాయ సహకార సంఘాలు ౪,౩౩౦, వ్యయసాయేతర సహకార సంఘాలు ౧౩౧ కలవు.

మరాట్వాడాలో పి. డబ్ల్యు. డి. రోడ్లమైళ్లనిడివి ౧,౪౫౪ మైళ్లు.

ఆర్. టి. డి. బస్సులు, సరుకుల బండ్లుగాక, ౧,౦౪౯ మోటారు బండ్లు రిజిస్టరు చేయబడినవి. డ్రైవింగు లైసెన్సులు ౯౪౪ ఇవ్వబడినవి.

మరాట్వాలో ౮౮౪ తపాలా ఆఫీసులు, ౨౭ టెలిగ్రాఫ్ ఆఫీసులు కలవు.

నివేశన గృహముల సంఖ్య ౮,౯౯,౦౦౦

ప్రాథమిక పాఠశాలల సంఖ్య ౩,౬౮౦. విద్యార్థుల సంఖ్య ౨,౨౪,౬౪౬. ఉపాధ్యాయుల సంఖ్య ౭,౭౦౦.

౭౫ మాధ్యమిక పాఠశాలలు, ౪౦ ఉన్నత పాఠశాలలు. ౫ ప్రత్యేక వృత్తి పాఠశాలలు, ౩ ఆర్ట్స్ సైన్స్ కళాశాలలు, ఒక వృత్తి కళాశాల కలవు.

౭ ఆసుపత్రులు, ౧౧౯ ప్రభుత్వ చికిత్సాలయాలు. ౧౫౪ మంది ప్రభుత్వ డాక్టర్లు కలరు. వీటిలో రోగుల మంచాల సంఖ్య ౫౯౧ (అలోపతిక్).

ఆర్థిక రీత్యా పనిపాటలలో నిమగ్నమైవున్న వారు, స్వయం పోషకులు, ఆర్జిస్తూ కూడా ఆశ్రితులుగా ఉన్నవారు మొత్తం ౩,౮౬,౦౦౦ మంది ఉన్నారు.

## సామాజికాభివృద్ధి

మరాట్వాడాప్రాంతంలో ప్రథమపంచవర్ష ప్రణాళిక గడువు ముగిసేనాటికి మూడు సామాజికాభివృద్ధి కేంద్రాలు పనిచేస్తూ వున్నవి. ఈ కేంద్రాల క్రింద ౩౩౮ గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం ౬,౮౬,౪౯౩ ఎకరాలు. జనాభా ౨,౩౧,౩౪౩. ఈ కేంద్రాలు బీడ్, నాందేడ్, కన్నడ్‌లలో ఒక్కొక్కటి చొప్పున కలవు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక గడువు ముగిసేనాటికి మరాట్వాడాలో అయిదు జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు కలవు. ఇవి విజాపూర్, ఒమెర్గా, సిల్లోడ్, పటోడా, భోకర్దన్ (అజంతా), హింగోలీ, ఆష్టిలలో ఒక్కొక్కటి చొప్పున ఉన్నవి. ఈఅయిదు కేంద్రాల క్రింద ౫౯౮ గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం ౧౫,౨౦.౨౭౮ ఎకరాలు. జనాభా ౪,౫౬,౦౫౬.

ఈ సంవత్సరం బీడ్, బీదర్, పర్భనీ, ఔరంగాబాదు, నాందేడు, ఉస్మానాబాదుజిల్లాలలో మరి ఆరు జాతీయవిస్తరణ సేవా కేంద్రాలు ప్రారంభించబడినవి.

స్థానికాభివృద్ధిపనుల పథకంక్రింద మరాట్వాడా జిల్లాలలో ౧౯౫౪-౫౫ సం.లో పెట్టబడిన ఖర్చు వివరాలు ఈ క్రింది విధంగా వున్నవి.

ఔరంగాబాదు రూ. ౩౭,౪౬౪, బీడ్ రూ. ౨౦,౧౦౦, నాందేడ్ రూ. ౧,౦౨,౮౦౬, ఉస్మానాబాదు రూ. ౧,౦౨, ౨౦౪, పర్భనీ ౧,౦౧,౧౮౯.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో మరాట్వాడాకు సంబంధించిన సామాజికాభివృద్ధి శిక్షణ కేంద్రాల నిర్వహణకై చేయబడిన వ్యయం వివరాలు దిగువ విధంగా ఉన్నవి :

౧. సింగిల్ షిఫ్ట్ ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ కేంద్రం, పర్భనీ, (తాత్కాలికంగా ఈ కేంద్రం హిమాయత్‌సాగర్‌లో నెలకొల్పబడింది.) రూ. ౧,౪౨,౫౮౦. (దీనికి రెండవ ప్రణాళికలో కేటాయింపబడిన డబ్బు రూ. ౩,౬౫,౦౦౦.)

౨. ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాల, పర్భనీ, (తాత్కాలికంగా హిమాయత్ సాగర్‌లో నెలకొల్ప బడింది.) రూ. ౫౮,౯౭౪. ( దీనికి రెండవ ప్రణాళికలో కేటాయించబడిన డబ్బు రూ. ౨,౭౬,౦౦౦.)

రెండవ ప్రణాళికలో రూ. ౯౮,౧౦౦ ల వ్యయంతో పర్భనీ గ్రూప్ లెవల్ వర్కర్స్ పథకం, రూ. ౭౯,౫౦౦ ల వ్యయంతో పర్భనీలో ఒక గ్రామీణ యువక కేంద్రాన్ని నిర్మించే పథకం, రూ. ౧,౦౦,౦౦౦ లు ఖర్చు కాగల రెండు రిఫ్రెషర్ కోర్సుల పథకం కూడా చేర్చబడినవి.

రెండవ ప్రణాళిక కాలంలో మరాట్వాడాలో రూ. ౨౫౭. ౬౨ లక్షలు సామాజికాభివృద్ధిపనులపై ఖర్చుపెట్టబడగలవు.

మరాట్వాడా ప్రాంతానికి రెండవ ప్రణాళికలో మొత్తం రూ. ౨౫.౫౯ కోట్లు కేటాయించబడినవి.

## కర్నాటకం

మైసూరు రాష్ట్రంలో విలీనం చేయబడుతున్న కర్నాటక ప్రాంతంలో ఆలంపురం, గద్వాల తాలూకాలు మినహా పూర్తి రాయచూరుజిల్లా, తాండూరు, కోడంగల్‌తాలూకాలు మినహా పూర్తి గుల్బర్గాజిల్లా, బీదర్‌జిల్లాలోని బీదర్, హుమ్నాబాదు, భాల్కి, సంతపూర్ తాలూకా లున్నాయి.

కర్నాటక ప్రాంతపు మొత్తం విస్తీర్ణం ౧౪,౦౫౬.౧ చదరపు మైళ్లు, జనాభా ౨౩,౧౩,౮౧౩. అంటే ప్రతి చదరపు మైలుకు ౧౯౩ మంది నివసిస్తున్నా రన్నమాట.

ఈ ప్రాంతంలో మొత్తం ౨౩ తాలూకాలు, ౮౨ రెవిన్యూ ఫిర్కాలు, ౩,౫౫౭ రెవిన్యూ గ్రామాలు, పట్టణాలు కలవు. వీటిలో యేభై వేలకు పైగా ఒక లక్షకు లోపు జనాభా గల రెండు రెండవశ్రేణి పట్టణాలు కలవు.

జనాభాలో పురుషుల సంఖ్య ౧౩,౬౭,౦౦౦, స్త్రీల సంఖ్య ౧౩,౫౧,౦౦౦. అంటే ప్రతివెయ్యిమంది పురుషులకు ౯౮౮ మంది స్త్రీలున్నారన్నమాట.

పట్టణాల జనాభా ౫,౧౭,౦౦౦. గ్రామాల జనాభా ౨౨, ౦౧,౦౦౦. ఈ ప్రాంతంలో కన్నడం మాట్లాడువారి సంఖ్య ౧౩,౬౯,౦౦౦. అంటే నూటికి ౬౫.౧ వంతుల మంది కన్నడం మాట్లాడేవారున్నారు. ఉర్దూ మాట్లాడేవారి సంఖ్య

౩,౯౪,౦౦౦. అంటే నూటికి ౧౪.౫ వంతుల మంది ఉర్దూ మాట్లాడేవారున్నారు. మరాఠీమాట్లాడేవారి సంఖ్య౧,౭౧,౦౦౦. అంటే నూటికి ౬.౩ వంతులమంది మరాఠీ మాట్లాడేవారున్నారు. తెలుగు మాట్లాడేవారి సంఖ్య ౨,౭౧,౦౦౦. అంటే నూటికి పదివంతుల మంది తెలుగు మాట్లాడేవా రున్నారు. ౧,౧౩,౦౦౦ మంది అంటే నూటికి ౪.౧ వంతుల మంది ఇతర భాషలు మాట్లాడేవారు కలరు. జనాభాలో ౨౧,౦౩,౦౦౦ మంది అంటే నూటికి ౭౭.౪ వంతుల మంది వ్యవసాయం పైననూ, ౬,౧౫,౦౦౦ మంది అంటే నూటికి ౨౨.౬ వంతుల మంది వ్యవసాయేతరములైన పనులపైనను ఆధారపడి వున్నారు.

సంవత్సరపు సగటు వర్షపాతం ౨౬౯౫ అంగుళాలు.

ఈ ప్రాంతంలో ౩,౭౩,౦౦౦ ఎకరాల మేరకు అడవులు కలవు. అంటే మొత్తం ప్రాంతంలో నూటికి ౪.౨ వంతులు అడవులు కలవన్నమాట.

పైరులు వేయబడు మొత్తం భూమి ౬౪,౮౬,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౭౨.౮ వంతులన్నమాట.

సేద్యయోగ్యంగాక పడావా పడివున్న భూమి ౩,౯౧,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౪.౪ వంతులన్నమాట.

వ్యవసాయేతర పనులకు ఉపయోగింపబడుతున్న భూమి ౨,౬౫,౦౦౦ ఎకరాలు. అంటే నూటికి ౨.౯ వంతులు.

౨,౦౬,౦౦౦ ఎకరాల భూమి అంటే నూటికి ౨.౩ వంతుల భూమి సాగుకు యోగ్యమైన దైనప్పటికి సేద్యం చేయబడకుండా వున్నది.

మిగిలిన భూమిలో పచ్చికబయళ్ళు, వివిధములైన చెట్లు, పైరులు, తోపులు వున్నవి.

వివిధ జలాధారముల వల్ల సాగుచేయబడు మొత్తంభూమి ౮౬,౭౦౦ ఎకరాలు. ఇందులో ౨౬,౭౦౦ ఎకరాలు చెరువుల వల్ల సాగు అవుతున్నవి. బావుల వల్ల ౪౪,౭౦౦ ఎకరాలు సాగు అవుతున్నవి. ప్రభుత్వకాలువలవల్ల ,౭౦౦ ఎకరాలు, ప్రైవేటు కాలువల వల్ల ౨౦౦ ఎకరాలు సాగు అవుతున్నవి. ౪,౬౦౦ ఎకరాలు ఇతరజలాధారములవల్ల సాగుఅవుతున్నవి. పైరులు వేయబడు మొత్తం భూమి ౬౫,౫౫,౦౦౦ ఎకరాలు. ఇందులో ౩౩,౮౬,౦౦౦ ఎకరాలలో పండించబడుతున్న ఆహార ధాన్యాల వివరాలు దిగువ విధంగా ఉన్నవి :

వరి ౯౬,౦౦౦ఎకరాలు, జొన్నలు ౨౩,౭౩,౦౦౦ఎకరాలు, గోధుమలు ౧,౪౦,౦౦౦ ఎకరాలు, సజ్జలు ౩,౮౦,౦౦౦ ఎకరాలు, మొక్కజొన్నలు ౨,౦౦౦ ఎకరాలు, రాగులు ౧౧,౦౦౦ ఎకరాలు.

౧౦,౦౦,౦౦౦ ఎకరాలలో పండించబడుతున్న పప్పుధాన్యాల వివరాలు ఈ క్రిందివిధంగా కలవు :

చెరకు ౧౩,౦౦౦ ఎకరాలు, నూనెగింజలు ౧౧,౬౦,౦౦౦ ఎకరాలు, ప్రత్తి ౮౪౧,౦౦౦ ఎకరాలు, పొగాకు ౨,౦౦౦ ఎకరాలు.

ఏడాదికి ౨౭,౧౦౦ టన్నుల వడ్లు ౩,౭౯,౨౦౦టన్నుల జొన్నలు, ౩౧,౭౦౦ టన్నుల సజ్జలు, ౧౩,౫౦౦౦ టన్నుల గోధుమలు, ౩౦౦టన్నుల మొక్కజొన్నలు, ౧,౨౦౦టన్నుల రాగులు, ౩౯,౯౦౦ టన్నుల ఉలువలు, ౪౦,౦౦౦ టన్నుల కందులు, ౧౦,౪౦౦ టన్నుల పెసలు, ౧,౫౭,౨౦౦ టన్నుల వేరుసెనగ, ౭౦౦ టన్నుల ఆముదాలు, ౯౯,౭౦౦ బేళ్ల ప్రత్తి, ౩౨,౭౦౦ టన్నుల చెరకు, ౪౦౦ టన్నుల పొగాకు ఉత్పత్తి అవుతున్నవి.

ప్రతి ఎకరాలో పంటల సగటు దిగుబడి ఈ విధంగా ఉన్నది :

వడ్లు ౬౩౩ పౌనులు, గోధుమలు ౨౧౬ పౌనులు, జొన్నలు ౩౫౮ పౌనులు, వేరుసెనగ ౫౪౨ పౌనులు, ఆముదాలు ౯౨ పౌనులు, చెరకు (బెల్లం) ౫౬౦౫ పౌనులు, ప్రత్తి(ఏకుమ దూది) ౪౬ పౌనులు, పొగాకు ౪౯౮పౌనులు.

ఈ ప్రాంతంలో దుక్కి దున్నుటకు పనికివచ్చు పశువుల సంఖ్య ౫,౭౯,౦౦౦. మొత్తం ౨,౧౫,౦౦౦ నాగళ్లు, ౭౫,౦౦౦ బండ్లు కలవు.

౧౧,౭౧,౦౦౦ ఎద్దులు, ఆవులు; ౩,౭౪,౦౦ గేదెలు, దున్నపోతులు; ౪,౯౨,౦౦౦ కోళ్లు. ౭,౮౫,౦౦౦ గొర్రెలు, ౪,౭౫,౦౦౦ మేకలు కలవు.

వివిధ గనులలో రోజుకు సగటున ౩,౯౮౭ మంది కార్మికులు నియమించబడుతున్నారు.

ఏడాదికి ౧౮,౬౪౬ ఫైన్ ఔన్సుల బంగారం, ౧,౧౮౮ ఫైన్ ఔన్సుల వెండి, ౬,౪౨,౬౦౦ టన్నుల సున్నపురాయి, ౭౦ టన్నుల క్వార్ట్జురాయి ఉత్పత్తి అవుతున్నవి.

౧౭౩ భారీ పారిశ్రామిక సంస్థలు కలవు. వీటిలో రోజుకు సగటున ౧౦,౦౦౦ కార్మికులు నియమించబడుతున్నారు. ౨౪,౦౦౦ స్వల్ప, కుటీరపరిశ్రమలు కలవు. వీటిలో రోజుకు సగటున ౮౩,౦౦౦ కార్మికులు నియమించబడుతున్నారు.

ప్రతి యేటా ౧,౫౩,౪౪,౦౦౦ గజముల వస్త్రము, ౫౧,౯౬,౦౦౦ పౌనుల నూలు, ౩,౪౧,౦౦౦ టన్నుల సిమెంటు, ౩౩,౦౦౦ టన్నుల పంచదార, ౩౧,౭౩,౦౦౦ కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతున్నవి.

భారీ పరిశ్రమలలో పనిలోకి రాకుండా గైరుహాజరు అగు వారు నూటికి ౨౦.౮ మంది ఉంటారు. క్రమబద్ధమైన మార్కెట్లు ౧౬ కలవు. సహకార బ్యాంకులు ౫, సహకార

వ్యవసాయ బ్యాంకులు ౨,౩౧౮, వ్యవసాయేతర సహకార బ్యాంకులు ౧౧౬ కలవు.

పి. డబ్ల్యు. డి. రోడ్ల మైళ్ళు నిడివి ౧,౧౩౨ మైళ్లు.

ఆర్. టి. డి. బస్సులు, సరకుల బండ్లు గాక, ౧,౧౧౮ మోటారు బండ్లు రిజిస్టరు చేయబడినవి.

డ్రైవింగ్ లైసెన్సులు ౯౬౬ ఇవ్వబడినవి.

ఈ ప్రాంతంలో ౪౬౦ తపాలా ఆఫీసులు, ౧౮ టెలిగ్రాఫ్ ఆఫీసులు కలవు.

నివేశన గృహముల సంఖ్య ౫,౧౩,౦౦౦.

ప్రాథమిక పాఠశాలల సంఖ్య ౧౯౩౨. విద్యార్థుల సంఖ్య ౧,౧౫,౫౭౭, ఉపాధ్యాయుల సంఖ్య ౪౦౫౦.

౩౫ మాధ్యమిక పాఠశాలలు, ౧౮ ఉన్నత పాఠశాలలు, ౪ ప్రత్యేక వృత్తి పాఠశాలలు, ౩ ఆర్ట్సు సైన్సు కళాశాలలు కలవు.

కర్నాటక ప్రాంతంలో ౭ అల్లోపతి వైద్యశాలలు, ౫౭ ప్రభుత్వ చికిత్సాలయాలు, ౬౭ మంది ప్రభుత్వ డాక్టర్లు కలరు. ఈ ఆసుపత్రులలో ౩౫౨ మంది రోగులకు (అల్లోపతిక్) మంచాల వసతి కలదు.

ఆర్థికరీత్యా పనిపాటలలోనిమగ్నమై వున్నవారు. స్వయం పోషకులు, ఆర్జిస్తూ కూడా ఆశ్రితులుగా వున్నవారు మొత్తం ౧౧,౨౯,౦౦౦ మంది వున్నారు.

## సామాజికాభివృద్ధి

కర్నాటక ప్రాంతంలో మొదటి పంచవర్ష ప్రణాళిక గడువు ముగిసేనాటికి ౩ సామాజికాభివృద్ధి కేంద్రాలు పనిచేస్తున్నవి. వీటిలో రెండు తుంగభద్ర వద్ద, ఒకటి గుల్బర్గా వద్ద కలవు. ఈ కేంద్రాల క్రింద ౨౬౨ గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం ౬,౫౯,౧౨౮ ఎకరాలు, జనాభా ౨,౮౧,౧౪౪.

మొదటి ప్రణాళిక గడువు ముగిసేనాటికి కర్నాటక ప్రాంతంలో రెండు జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు కలవు. ఇవి యాద్గీర్, హుమ్నాబాదులలో ఉన్నవి. ఈ రెండు కేంద్రాల క్రింద ౧౯౩ గ్రామాలున్నవి. ఈప్రాంతం విస్తీర్ణం ౭,౦౭,౩౮౧ ఎకరాలు, జనాభా ౧,౯౪,౧౧౪.

ఈ సంవత్సరం గుల్బర్గా జిల్లాలోని అలంద్‌లోనూ, రాయచూరు జిల్లాలోని సింధ్నూరులోను ఒక్కొక్కటి చొప్పున మరి రెండు జాతీయవిస్తరణ సేవా కేంద్రాలు తెరువబడినవి.

స్థానికాభివృద్ధి పథకం క్రింద కర్నాటక జిల్లాలలో ౧౯౫౪-౫౫ వ సం. లో పెట్టబడిన ఖర్చు వివరాలు ఈక్రింది విధంగా ఉన్నవి.

గుల్బర్గా ౧,౩౮,౭౧౨, రాయచూర్ రూ. ౧,౪౭,౬౫౩, బీదర్ ౧,౦౩,౧౭౨. కర్నాటక ప్రాంతం కొరకు రెండవ ప్రణాళికలో రూ. ౬,౧౬,౫౦౦ ల ఖర్చుతో మునీరాబాదులో ఒక డబుల్ షిఫ్ట్ ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ కేంద్రాన్ని తెరిచే పథకం, రూ. ౪,౦౧,౦౦౦ ల ఖర్చుతో మునీరాబాదులో ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలను నెలకొల్పే పథకంకూడా చేర్చబడినవి.

రెండవ ప్రణాళికలో కర్నాటక ప్రాంతంలో సామాజికాభివృద్ధి నిమిత్తం రూ. ౧౨౯.౧౨ లక్షలు కేటాయించబడినవి. ఈ ప్రాంతానికై రెండవ ప్రణాళికలో మొత్తం రూ. ౧౯.౬ కోట్లు కేటాయించబడినవి.



# సమర్థవంతమైన సేద్య ప్రమాణాలు



హైదరాబాదు ల్యాండు కమీషన్ (భూవిధాన సలహా సంఘం)వారు 'కుటుంబ కమతం' 'స్థానిక ప్రాంతాలు', కమతాల ఏకీకరణనుగూర్చి చేసిన సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది. ఈ సంఘం ఇప్పుడు సమర్థవంతమైన సేద్యప్రమాణాలు, నిర్వహణ విధానాన్నిగూర్చిన తన మూడవ నివేదికను దాఖలు చేసింది.

ఈ నివేదికలో కమీషన్ చేసిన ముఖ్యమైన సూచనలలో రాష్ట్ర భూ నిర్వహణ సంఘస్థాపన, నిర్ణీత ప్రమాణాలను అనుసరించవలసిన కొన్ని ఫారముల నిర్బంధ రిజిస్ట్రేషను చాలా ముఖ్యమైనవి.



*హైద్రాబాదు కౌల్దారీ చట్టంయొక్క 38-ఇ సెక్షను ననుసరించి భూముల యజమానులుగా ప్రకటింపబడినట్టి రక్షిత కౌలుదార్లకు 1956 జులై 14 వ తేదీన మధిర తాలూకా రెబ్బారం గ్రామంలో రాష్ట్రముఖ్యమంత్రిగారు తక్కావీ ఋణాలను పంచిపెట్టారు.*

ప్రభుత్వం ఈ సిఫారసులను ఆమోదించింది. ఇందుకు అవసరమైన శాసనాలను ప్రవేశపెట్టవలసి వున్నది. సేద్య ప్రమాణాలు రెండువిధములుగా నిర్ణయింపబడుతాయి. ఒకరకం అన్ని క్షేత్రాలకు వర్తిస్తుంది. రెండవ రకం మూడు కమతముల ప్రమాణంగల క్షేత్రాలకు మాత్రమే వర్తిస్తుంది. ఈ రెండవరకం క్షేత్రాలు పరిశీలన కొరకై రిజిస్టరు చేయబడుతాయి. మొదట ఈ కార్యక్రమం అవసరమైన డబ్బు, సాంకేతిక సిబ్బందిలభించగల సామాజికాభివృద్ధి ప్రాంతాలలో, జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో అమలు జరుపబడుతుంది.

ప్రతి రాష్ట్రం తగువిధంగా భూ నిర్వహణ శాసనాలను చేయవలెనని ప్లానింగు కమీషన్‌వారు సిఫారసు చేశారు. ఆ సిఫారసు ననుసరించి హైద్రాబాదు ప్రభుత్వం ౧౯౫౪ సంవత్సరపు హైద్రాబాదు కౌల్దారీ వ్యవసాయక భూముల చట్టంలోని ౬ వ అధ్యాయాన్ని సవరించింది. ఆ సవరణవల్ల సమర్థవంతమైన సేద్య ప్రమాణాలను, యాజమాన్య విధానాన్ని నిర్ణయించడానికి, అట్టి ప్రమాణాల ప్రకారం సేద్యం జరుగునట్టి కమతాలను పూర్తిగా గాని, లేక వాటిలో కొంత భాగాన్నిగాని, స్వాధీన

పరచుకోవడానికి, లేదా వాటిపై నిర్వహణము వహించడానికి నియమావళిని తయారుచేసే అధికారం ప్రభుత్వానికి లభించింది.

భూములలో సేద్యం, నిర్వహణ సమర్థవంతంగా జరుగుతున్నదా, లేదా అనే విషయాన్ని నిర్ణయించడానికై ల్యాండ్ కమీషన్‌వారు ఈ దిగువ ప్రమాణాలను సూచించారు.

౧. (అ) భూసారమును కాపాడడానికై ఆర్థికంగా సాధ్యమైన సందర్భాలలో భూమిని చదును చేసి, కట్టలు వేసి, సమతలముగా జేయుట, ఇంకా అవసరమైన ఇతర చర్యలు గైకొనుట;

(ఆ) సేద్యమునకు యోగ్యమయి కూడా సేద్యం చేయబడకుండావున్న భూమిని అభివృద్ధి పరచి సాగుకు తెచ్చుట, అంటే బంజరు భూములలో నీరు నిలిచిపోయే చోట్ల కాలువలు త్రవ్వి ఆ నీటిని వెలుపలికి పంపి, భూమిలోని క్షారమును పోగొట్టుటకు తగుచర్యలు గైకొని, భూసంరక్షణ పద్ధతుల నవలంబించి భూమిని సాగుకు లాయకు చేయుట, హానికరమైన కలుపు మొక్కలను తీసి వేయుట, పొదలను, చెట్లు చేమలను తీసి వేయుట;

౨. పరిశుద్ధమైన మేలురకం విత్తనములను ఉపయోగించుట :

౩. ఎరువులు, రసాయనిక ఎరువులు (అ) పశువులదొడ్డి ఎరువును పదిలపరచుట. (ఆ) పశువుల దొడ్డి చెత్త చెదారములను కంపోస్టు ఎరువుగా తయారుచేయుట, (ఇ) పచ్చి ఎరువును విడువకుండా ఉపయోగించడము, (ఈ) అవసరమైన చోట్ల ఆర్థికంగా సాధ్యమైనచోట్ల రసాయనిక ఎరువులను ఉపయోగించుట;

౪. నీటిపారుదల : (అ) కాలువలు లేనిచోట్ల స్వతంత్రంగా గాని లేక ఇరుగు పొరుగు రైతుల సహకారంతోగాని బావులను, గొట్టపు బావులను, పంపులను, చెరువులను, డాములను నిర్మించుట. (ఆ) కాలువలను సక్రమంగా నిర్వహించుకుంటూ నీటిని పొదుపుగా లాభసాటిగా ఉపయోగించుట— అంటే గచ్చు వేయడం, కాలువలు వంకర టింకగా లేకుండా సాధ్యమైనంత వరకు తిన్నగా ఉండునట్లు చేయడం, కాలువలలో మొక్కలు మొదలైనవి పెరుగకుండా వాటిని తొలగించడం, కాలువల నుంచి నీరు కారిపోకుండా ఆర్థికంగా సాధ్యమైన చోట్ల వాటిని పక్కా కాలువలుగా నిర్మించడం;

౫. వ్యవసాయ పనిముట్లు : వ్యవసాయశాఖ వారు ఏభూములకు ఎటువంటి పనిముట్లను ఉపయోగించ వలెనని సిఫారసు చేస్తారో ఆ విధంగా మేలు రకం వ్యవసాయ పనిముట్లు ఉపయోగించడం;

౬. సాధారణంగా వ్యవసాయశాఖ సిఫారసు చేసే పద్ధతుల ప్రకారం స్వతంత్రంగాగాని లేక స్థానిక రైతుల సహకారంతోగాని పైరులకు తగిలే తెగుళ్ళను నిర్మూలించడం, హానికరమైన మొక్కలను తొలగించడం;

౭. నారుమళ్ళను తయారుచేయడం, విత్తనం వేసే పద్ధతులు, కలగలుపు పైరులు వేయడం, కలుపు తీయడం, నాసిరకం మొక్కలను తొలగించడం, పంటకోతల పద్ధతులకు సంబంధించిన ఆధునిక వ్యవసాయ పద్ధతులు;

౮. భూములలో తగువిధంగా పైరులను మార్చి వేస్తూ ఉండడం;

౯. బావులవద్ద, సేద్యయోగ్యమైన భూములలో చెట్లునాటడం, వాటిని సంరక్షించడం ముఖ్యంగా నీటి వనరుల ప్రక్కన;

౧౦. మెట్టసేద్యమైనట్లయితే, వ్యవసాయశాఖ సిఫారసు చేసిన విధంగా ఉత్తమతరమైన మెట్ట వ్యవసాయ పద్ధతులు. ఉదాహరణకు : (అ) వర్షాలు మొదలుకాక మునుపే తక్కువ లోతుగా దుక్కి దున్నడం. (ఆ) కలుపు మొక్కలను తీసి వేయడం. (ఇ) కట్టలువేసి భూమిని సమతలం చేయడం. (ఈ) వర్షాలు నిలిచిపోయిన వెంటనే దుక్కిదున్ని గుంటకతోలి భూమిలోని తేమను పదిలపరచడం.

౧౧. మిశ్రమవ్యవసాయమును అవలంబించుట, లేదా పండ్లు, కూరగాయల తోటలు, పాడి కేంద్ర

ములు, కోళ్ళు, పశుల పెంపకం, తేనెటీగల పెంప కం మొదలగు వ్యవసాయమునకు సన్నిహిత మైనట్టి పరిశ్రమలను అవలంబించుట;

౧౨. పశుసంరక్షణ : (అ) ఆమోదింపబడినట్టి జాతుల పశువులను పెంచుట; (ఆ) పశువులకు మేత మొదలగునవి వేయడానికి కొట్టములు మొదలగు వాటిని ఏర్పరచి కట్టుదిట్టంగా ఆహారపుఏర్పాట్లు చేయుట; (ఇ) ఎరువులను జాగ్రత్త చేయుట. (ఈ) పశువులు ఉండటానికి మంచి కొట్టములు, శాలలు ఏర్పాటుచేయుట; (ఉ) పశువుల వ్యాధు లకు చికిత్స చేయడానికి, వ్యాధులు రాకుండా నిరోధించడానికి తగుచర్యలు గైకొనుట;

౧౩. సేద్య క్షేత్రమునకు కావలసిన పనిముట్లను సేకరించుట. శాశ్వతమైన అభివృద్ధి పనులకు పెట్టు బడి పెట్టుట;

౧౪. వ్యవసాయోత్పత్తులను నిలవచేయడానికి అవసరమైన గిడ్డంగులను ఏర్పాటు చేయుట.

౧౫. సేద్య క్షేత్రాలలో వ్యవసాయ కూలీలకు సక్రమమైన వేతనములనిచ్చి, పని షరతులను క్రమ బద్ధంచేసి వారికి నివసించడానికి తగు గృహవసతిని కల్పించుట;

౧౬. సేద్యమునకు సంబంధించిన జమాఖర్చు లెక్కలను సక్రమంగా ఉంచుట;

౧౭. సహకార సంఘాల కార్యక్రమాలలో పాల్గొనుట.

౧౮. వివిధ వ్యవసాయోత్పత్తులను ఒకదాని కొకటి కలిసిగాక వేర్వేరుగా నిలువ ఉంచుటకు తగు ఏర్పాటు చేయుట;

౧౯. మిగులుగావున్న ఆహార ధాన్యముల అమ్మకం;

## రిజిస్టరు చేయబడిన క్షేత్రాలు

మొదట ఈ ప్రమాణాలను మూడు కుటుంబ కమతముల ప్రమాణానికి సమానమయినట్టి లేక అంతకుమించినట్టి సేద్య క్షేత్రాలకుమాత్రమే వర్తిం పజేయాలని కమీషన్ సిఫారసు చేసింది. అటువంటి కమతాల నన్నిటినీ నిర్బంధంగా రిజిస్టర్డు క్షేత్రా లుగా చేర్చుకోవాలి. నిర్ణీత సేద్యప్రమాణాలను అనుసరించి సమర్థవంతమయిన ఉత్పత్తి కేంద్రా లుగా అభివృద్ధిచెందవలసిన బాధ్యత వాటిపై ఉంటుంది. అంతేగాక వ్యవసాయకూలీలు పనిచేసే స్థితిగతులను అభివృద్ధిపరచి వారికి న్యాయమయిన కూలీ లభించేటట్లు చూడవలసిఉంటుంది. అవి నిర్ణీత పద్ధతిప్రకారం క్షేత్రంయొక్క జమాఖర్చు లెక్క లను ఉంచవలసిఉంటుంది.

సేద్యం సమర్థవంతంగా జరుపబడుతున్నదా లేదా అనే విషయాన్ని నిర్ణయించేటప్పుడు కూలీలు దొరకడంలోగల చిక్కులు, కాలమాన పరిస్థితులు, ఇంకా అలాంటి కష్టనష్టాలను పరిశీలించవలసి ఉంటుంది. రిజిస్టరు చేయబడిన క్షేత్రాలు తమకు కావలసిన డబ్బును తామే సమకూర్చుకోగలిగి ఉండాలి.

ప్రమాణాలను నిర్ణయించేసే సందర్భంలో భూమితీరు, దాని యొక్క ఉనికిని కూడా ఆలో చించవలసిఉంటుంది. భూసార పరిస్థితి, కాలమాన పరిస్థితి ఒకచోట ఉన్నట్లుగా ఇంకొకచోట ఉండదు. సాధారణంగా రాష్ట్రస్థాయి పైన, జిల్లా స్థాయి పయిన సమర్థవంతమైన సేద్యప్రమాణాలను నిర్ణ యించవచ్చు. కాని ఇంకా క్రిందిస్థాయిలపై అంటే తాలూకా, గ్రామ స్థాయీలపై స్థానికపరిస్థితులను చూచి సరిపుచ్చుకోవలసి ఉంటుంది.

రిజిస్టర్డు చేయబడిన క్షేత్రాలను తనిఖీచేసి నాలుగు వర్గములుగా విభజింపవలెనని సిఫారసుచేయబడింది. ౧. చాలామంచిది. ౨. మంచిది. ౩. సామాన్య మయినది. ౪. చెడ్డది. 'సామాన్యమయినది' అనబడు దానికంటె తక్కువరకపు దని నిర్ణయింపబడిన క్షేత్రమునకు ఒకపర్యాయం హెచ్చరికచేసి, అది తన ప్రమాణాన్ని హెచ్చించుకోవడానికి కొంత అవ కాశమివ్వాలి. ఇచ్చిన గడువులోపల అభివృద్ధి చెందకపోయినట్లయితే దానిని ప్రభుత్వం స్వాధీన పరచుకోవాలి. లేదా దానిలో అభివృద్ధిపనులు జరి పించి వాటి కయిన ఖర్చులను, జరిమానా గాక కొంత శాతమునుకూడా రాబట్టాలి.

సామాన్యస్థాయి క్షేత్రాలను ఉన్నతస్థాయి క్షేత్రాలుగా అభివృద్ధిపరచడానికి అభివృద్ధి కార్య క్రమాలను తయారుచేయాలి. అటువంటి అభివృద్ధి సాధింపబడినందుకు బహుమతులు ఇవ్వాలి. ప్రభుత్వ సహాయంగాని లేక తక్కావీ ఋణాలను ఇచ్చు నప్పుడు ఆ కనుతాలలో నిర్ణీత ప్రమాణాల ప్రకా రము సేద్యం చేయబడవలెనని షరతు పెట్టవలెను.

## భూనిర్వహణ సంఘం

నిర్ణీత సేద్యప్రమాణాలను అమలుజరుపడానికై శాశ్వతపరిపాలనావ్యవస్థ అవసరం. రాష్ట్రం మొత్తా నికి రాష్ట్ర భూనిర్వహణసంఘం నియమింపబడవలె ననీ అందులో అధికారులు,అనధికారులు సభ్యులుగా ఉండవలెననీ, ప్రతిజిల్లాకు, తాలూకాకు, గ్రామా నికి కమిటీలు ఉండవలెననీ కమీషన్ సూచించింది. రాష్ట్ర భూనిర్వహణ సంఘానికి కార్యదర్శిగా పని చేయునట్టి ఒక సీనియర్ రెవిన్యూఉద్యోగి తన యావత్కాలమును భూ సంస్కరణలకు, భూ నిర్వ హణకు సంబంధించినపనిని చూస్తూఉంటాడు.

మొదట ఈ కార్యక్రమం అవసరమైన డబ్బు, సాంకేతిక సిబ్బంది లభించగల సామాజి కాభివృద్ధి ప్రాంతాలలో జాతీయవిస్తరణ సేవా కేంద్రాలు గల ప్రాంతాలలో ఆరంభింపబడవలెనని కమీషన్ సూచించింది. భూమిని, నీటిని పూర్తి వినియోగానికి తేగల అవకాశాలువుండే నీటిపారుదల ప్రాజెక్టులు గల ప్రాంతాలకుకూడా ప్రాముఖ్య మివ్వబడాలి.

నిర్ణీత ప్రమాణాలను అమలుజరుపడానికై నియ మావళి ప్రకటింపబడినతేదీ అనంతరం ఒక సంవత్స రము గడువుతో తేదీని నిర్ణయించాలి. ఆ రెండు తేదీలగల మధ్యకాలమును అవసరమైన పరిపాలనా పూర్వకమైన ఏర్పాట్లను చేయడానికీ, ఇందుకు తగు ప్రచారమును జరుపడానికీ వినియోగించాలి.

ఒకవేళ ఒకరైతు తనకుగల భూమిలో కొంత భాగంలోమాత్రమే నిర్ణీత ప్రమాణాలను పాటించి నట్లయితే మొత్తంభూమిని అన్వయంచేసి వర్గీకరణ మును జరుపవలెనేగాని ఏ భాగానికా భాగం విడిగా తీసికొని వర్గీకరణ చేయరాదని కమీషన్ అభి ప్రాయం వెలువరించింది.

ఉత్పత్తి అధికం కావలెనంటే సేద్యం సమర్థవం తంగా జరుగవలెనంటే ప్రాథమిక ఉత్పత్తిదారులకు న్యాయమైనధరలు లభించేటట్లు ప్రభుత్వం ప్రయ త్నాలు చేయవలెనని కమీషన్ సూచించింది.



# వార్తా చిత్రాలు



ఔరంగాబాదులో హైదరాబాదు స్థానికసంస్థల మహాసభ జరిగినప్పటి దృశ్యం.

స్థానిక సంస్థల మహాసభలో ఔరంగాబాదు మునిసిపల్ అధ్యక్షులు ప్రసంగిస్తున్నారు.

[దిగువ] స్థానికసంస్థల మహాసభకు విచ్చేసిన ప్రేక్షకులు.



పటన్‌చెరువు యన్. వి. యఫ్. శిబిరం పాసింగ్ - ఔట్ పెరేడ్‌లో రాష్ట్ర వ్యవసాయమంత్రి
డా. యం. చెన్నారెడ్డి కప్పులను బహూకరించారు.
[దిగువ] పెరేడును తనిఖీచేస్తున్న డా. చెన్నారెడ్డిగారు.





ముషీరాబాదులోని సహకార అగ్గిపెట్టెల ఫ్యాక్టరీకి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.
[దిగువ] ప్రారంభోత్సవసందర్భంలో రాష్ట్రవాణిజ్య పరిశ్రమలమంత్రి శ్రీ వినాయకరావ్ విద్యాలంకార్ ప్రసంగించారు.



అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ పరికరాలను ముఖ్యమంత్రి, తదితరులు చూస్తున్నారు.
[దిగువ] ఔరంగాబాద్‌లోని పాలిటెక్నిక్ భవనానికి హైదరాబాదు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.



# స్వతంత్రభారత ప్రగతిలో గర్వకారణాలు

**హింసామార్గాలవల్ల కాకుండా సత్యధర్మాలమీద ఆధారపడి భారతదేశం స్వరాజ్యం సంపాదించటం గర్వకారణమే. తర్వాత మన రాజ్యాంగ నిర్మాణం ఒక గొప్ప విజయం - మనుష్యజాతి యింతవరకు సంపాదించిన రాజకీయ విజ్ఞాన సారమంతా ఇందులో మూర్తీభవించింది. స్వతంత్రభారతం ప్రపంచానికంతా శాంతిసందేశ దూతగా వ్యవహరిస్తుంది. దేశంలో పంచవర్ష ప్రణాళికలద్వారా వివిధ రంగాలలో శీఘ్ర పురోగమనం కనిపిస్తుంది. ఇప్పుడు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అనే భీషణ సమస్య జయప్రదంగా పరిష్కరించబడ్డది. ఇవన్నీ మనకు గర్వకారణాలే. కానీ, యింతటితో అయిందా? 'జరగవలసిన వెన్నో వున్నాయి' అంటూ హెచ్చరించారు ముఖ్య మంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు తమ స్వాతంత్ర్యదిన సందేశంలో. వారు ఆనాటి తమ రేడియో ప్రసంగంలో యిలా అన్నారు:**

"ఏజాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం" అన్నాడొక ఆధునికాంధ్ర మహాకవి, ఉత్తర ధృవ ప్రాంతంలో ఉద్భవించి, కొంతకాలం మానవ మనో వీధిలో ప్రకాశించిన ఉషస్సు తాత్కాలిక అరుణరాగానికి రాగపరవశుడై. నిజమే! ఏమున్నది గర్వకారణం? ఈ ప్రశ్న పుట్టినంత వరకు జరిగిన చరిత్రలో! కానైతే మానవజాతి చరిత్రలో కడసారి పత్రం వ్రాయ గలిగిన దెవరు? చరిత్ర ప్రవాహం నడిచింది; నడుస్తోంది. గర్వకారణం కూడా కలిగింది. ఏజాతి చరిత్రలో? భారతజాతి చరిత్రలో. ఏమిటా గర్వకారణం? మన స్వాతంత్ర్య సాధన. ఇదివరకే జాతిగాని స్వాతంత్ర్యం సాధించలేదా? సాధించినది. మరి గర్వకారణం ఏమిటి? ఆ సాధనలో మన విశిష్టత హింసాకాండ లేకుండా, సత్యంమీద, ధర్మంమీద ఆధారపడి, భారతజాతి తన స్వరాజ్యం సాధించినది. మానవ చరిత్రలో ఇటువంటి సంఘటన ఇదివరకు లేదు. దీనితో చరిత్ర పోకడే మారిపోయినది. ప్రపంచ దృక్పథమే తారుమారైనది. ధర్మ క్షేత్రమని పేరుగన్న కురుక్షేత్ర మహా సంగ్రామంలో కూడా నిజానికి అన్యాయంగాని, అధర్మంగాని లేకపోలేదు. అయితే భారత యుద్ధంగాని, రామరావణ యుద్ధంగాని ఆధునిక రణరంగంముందు ఎంత? పురోగమించిన మానవ భౌతికజ్ఞానం, స్వార్థంకోసం, జీవహింసా పరికరంగా ప్రయోగిస్తున్న ఈ నవీన కాలంలో ఆధ్యాత్మిక జ్ఞానదృష్టి కలిగించి, అహింస సత్యం అనే సహజ ధర్మాలు అనుసరించి అసిధారా వ్రతంలో, హాని సత్వం, దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యంలో మునిగిపోయిన జీవచ్ఛవంలాటి జాతికి ఊపిరి పోసి, బతికించి, బట్టకట్టించి, ఆనాటి ప్రపంచంలో అజేయ మనిపించుకున్న ఒక దారుణ సామ్రాజ్య శక్తిని ధిక్కరించి, ధర్మవిజయం పొందిన జాతి ప్రభావం గర్వకారణంకాదా? అది మన పూర్వ ఋషుల తపస్సుకి సిద్ధి. సనాతన మార్గంలో భారత ప్రజలు చేసిన కృషికి ఫలం. ఏజాతి చరిత్రలోనూ లేని ఆ గర్వకారణం మనకు లభించి, నేటితో తొమ్మిదేళ్ళు నిండినవి. ఈనాడు మనకు పర్వదినం. తొమ్మిదవ స్వాతంత్ర్య దినోత్సవం. ఆసేతు హిమాచల పర్యంతం ఆబాల గోపాలం ఆనందంలో వున్నారు.

## స్వాతంత్ర్యం ఒక బాధ్యత

సంతోషప్రదమైన ఈ చల్లనివేళ, ఏ మహానుభావుడు తన జీవితంలో ధర్మం సాధించి, తన జాతిక ధర్మ మార్గంలో విజయం సాధించి, ధర్మ ప్రచారంకోసం ప్రార్థన వేదికకు వెడుతూ, దారుణ ఘాతకుడి తుపాకిగుళ్ళకు గురియై, రామ నామ స్మరణతో అవతారం చాలించి, లోకానికే వేగుచుక్కగా వెలిగిపోయినాడో, ఆ జాతిపిత, ఆ భారత స్వాతంత్ర్య ప్రదాత, గాంధి మహాత్ముడి పేరు తల్చుకుని, భారత ప్రజానీక మొక్కటై ఆ దివ్యమూర్తికి అంజలి ఘటించి, ధ్యానముద్ర దాల్చవలసిన మహా ముహూర్తం. ఈ ధ్యానశక్తి వల్ల మనకు లభించే జ్ఞానమార్గం ఒకటున్నది. రాజకీయ స్వాతంత్ర్యం అనేది ఏజాతికిగాని, బాని సత్వంలో వున్నంత వరకే ఒక జన్మహక్కు. ఏ హక్కుగాని లభించగానే బాధ్యతగా పరిణమిస్తుంది. స్వాతంత్ర్య మనేది ఈనాడు భారతజాతికి సంక్ర మించిన ఒక బాధ్యత. ఆ బాధ్యత ఈ ౯ సంవత్స రాలుగా మనం ఏవిధంగానిర్వహించామో సింహావ లోకనంచేస్తే మనయాత్ర ముందుకి సాగుతున్నదో, వెనక్కు పోతున్నదో అవగాహన అవుతుంది.

## రాజ్యాంగం

స్వాతంత్ర్యావతరణ తరువాత మనం చేసిన ఘనకార్యం మన రాజ్యాంగ నిర్మాణం. ఇంత వరకు మానవుడి అనుభవంలోకి వచ్చిన రాజకీయ విజ్ఞానం యావత్తు క్రోడీకరించి ఈ రాజ్యాంగం తయారు చేసినారు. వ్యక్తికిగాని, సంఘానికిగాని ఇంతకంటె అవకాశం వుండబోదు. శ్రేయోరాజ్యం అనగా అందరికీ క్షేమకరమైన పరిపాలనా విధానం ఏర్పాటు చేసుకోవడం మన లక్ష్యం. ఆ శ్రేయో రాజ్యంలో ప్రజల సౌభాగ్య సంరక్షణ ప్రభుత్వ బాధ్యతగా వుండాలన్నాం. కరుణారసంలో ప్రవ హించిన బుద్ధ భగవానుడి అష్టాంగమార్గ బోధా మృత చిహ్నం అశోక ధర్మచక్రం ఉపనిషత్సూత్రంతో సమన్వయించి, 'సత్యమేవ జయతి' అన్న సుశ్లోక సమేతంగా మన జాతీయ చిహ్నం చేసు కున్నాం.

ఇంటా, బయటా ఆ ధర్మం ఆచరిస్తున్నాం. ప్రపంచ సమాఖ్యలో ఈనాడు భారత ధర్మ ప్రవ చనం సుస్పష్టంగా వినబడుతున్నది. పరిశీలించబడు తున్నది. కొన్నిచోట్ల ఆచరించబడుతున్నది. 'ఓం శాంతిః' అన్నది అనాదిగా భారతీయుల మంగళ శ్లోకం. ఆ మంగళవాక్యమే ప్రపంచంలో ప్రచారం చేస్తున్నారు. ప్రతిభావంతుడు మన ప్రధాని నెహ్రూ. బౌద్ధ ధర్మాంగమైన పంచశీలాలు ఆధు నిక అంతర్జాతీయ రాజకీయ సాంఘిక జీవనానికి అన్వయించి, పారివ్రాజకుడై ప్రపంచమంతా తిరిగి పునఃప్రతిష్ఠచేసి ప్రపంచ శాంతి స్థాపనకు మార్గ దర్శకుడైనాడు. అది మనజాతి చరిత్రలో మరొక గర్వకారణం.

## పంచవర్ష ప్రణాళిక

'ఇంట గెలిచి రచ్చ గెలువ' మన్నారు. మన దేశంలో స్తోమత, శాంతి లేకుండా పరాయివారికి ధర్మపన్నాలు బోధించేస్థితిలో మనం లేము. ఇంటి సంగతి చూసుకునే ఇతరవ్యాసంగానికి పోతున్నాం. మనసంగతి మనం చూసుకొని ముందుకు వెళ్ళగలిగే శక్తి మనకు వున్నదీ అన్న సత్యం ప్రథమపంచవర్ష ప్రణాళిక నిర్వహణలో బోధపడింది. ప్రణాళిక ప్రగతి ఒక్కవిషయం పరిశీలిస్తే బోధపడుతుంది. ఈ అయిదేళ్ళలో మనదేశంలో ఆదాయం నూటికి పద్దెనిమిదివంతులు పెరిగింది. మచ్చుకి మన ప్రదే శంలో పరిశీలిద్దాం. ఇతర ప్రదేశాలకంటె మనం ఆలస్యంగా ప్రారంభించాం. అయినా తయారుగా పెట్టుకున్న నలభై కోట్లలోనూ ముప్పైఏనాలుగు కోట్లకి పయిగా ఖర్చుచేసి ప్రజలకి సదుపాయాలు ఏర్పాటు చెయ్యగలిగినాము. మూడేళ్ళలో అద నంగా పదిలక్షల టన్నుల ఆహారపదార్థాలు పండించుకున్నాం. ఒకలక్షా యాభై వేల టన్నుల పత్తి అదనంగా పండించుకున్నాం. పెద్దవీ, చిన్నవీ

నీటి వనరులు ఏర్పాటుచేసుకున్నాం. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పథకాలు నడుపుతున్నాం. వ్యవసాయదారుకి అనేకవిధాల సహాయం చేస్తున్నాం. సౌభాగ్యముకోసం జాతీయవికాస పథకాలు నాలుగువేల గ్రామాలలో అమలు జరుపుకున్నాం. విద్యాభివృద్ధికి, ప్రజారోగ్యానికి, ఏర్పాట్లుచేసుకున్నాం.

## ఏకీకరణ

జాతీయ స్థాయిలో ఇంత నిర్మాణ కార్యక్రమం ఒక్కుమ్మడిగా నడపడానికి మనకి అవకాశం కలగడానికి పునాది స్వరాజ్యం రాగానే వేసుకున్నాం. అది భారతదేశపు ఏకీకరణ. చిన్నవీ పెద్దవీ హైద్రాబాదు సహా అయిదువందల అరవై సంస్థానాలూ, పది పన్నెండు రాష్ట్రాలు, ప్రత్యేక పరిపాలనా ప్రాంతాలు, అనేక విధాల తమ సామ్రాజ్య సంరక్షణ కోసం బ్రిటిషువారు పరిపాలన ఛిన్నాభిన్నంగా చేసి పోయినారు. ఈభౌతిక భిన్నత్వంలో వున్న ఏకత్వం సార్థకం చేయడానికి ఏకీకరణ ప్రారంభించి కృతకృత్యుడైనాడు కీర్తిశేషుడు సర్దారు పటేలు. అక్కడక్కడ ముఖ్యంగా మన సంస్థానంలో దౌర్జన్య ప్రదర్శనం జరిగినా, జననష్టం లేకుండా ఏకీకరణ సాధించుకున్నాం. ఇదికూడ మనజాతి చరిత్రలో మరొక గర్వకారణం.

సర్దారుపని పూర్తికాలేదు. బ్రిటిషువారి ఛిన్నాభిన్నంలో వారికి తోచిన రీతిని పరిపాలనా ప్రాంతాలు ఏర్పాటు చేసినారు. హైద్రాబాదు రాజ్యంలో మూడు ముఖ్య భాషలున్నాయి. తెలుగు, మహారాష్ట్రం, కన్నడం. కాని ఈభాషలు మాట్లాడే అధిక సంఖ్యాకులు ఇతర రాష్ట్రాలలో వున్నారు.ఒక భాషవారు ఒకపరిపాలనాప్రాంతంలో వుండడం ధర్మం అన్న సూత్రం కాంగ్రెసు సంస్థ ఏనాడో అంగీకరించినది. ఆ ప్రకారం భాషా సూత్రం మీద ప్రదేశ నిర్మాణ కార్యక్రమం ప్రారంభించాం. ఈ భాషావాదం వెర్రి తలలు వేసి మన్ను మింగేస్తుందనే భయం కలిగింది. భాషావాదమే కాక ప్రాంతీయ వాదన కూడా చెలరేగింది. ఇదో ఉత్పాతంలా పరిణమించింది. ప్రధాన మంత్రి సానుభూతివల్ల, ఓపికవల్ల, ధైర్య స్థైర్యాల వల్ల ఈ సమస్యకూడా పరిష్కారం అయిపోయింది. సంకుచిత ప్రాంతీయ వాదానికి గొడ్డలి పెట్టుగా ద్విభాషా రాష్ట్రంగా బొంబాయి రూపొందుతోంది. కర్ణాటక ప్రాంతాలన్ని కలిసి మైసూరు ప్రదేశంలో లీనమై సౌష్టవమైన కర్ణాట ప్రదేశంగా పరిణమిస్తున్నవి. తెలుగు ప్రజలంతా కలిసి హైద్రాబాదు ముఖ్య నగరంగా ఆంధ్ర ప్రదేశ్‌లో ఏకం కానున్నారు. హైద్రాబాదు నగరం పేరేగాని రాజ్యం పేరుగా వుండదు. ఎంత రాజకీయవాదం చేసినా, పరిపాలనా సౌలభ్యం చూసినా, పాత స్నేహ బృందాలతో వీడుకోలు రోజు సమీపిస్తున్నకొద్దీ ఏదో చెప్పలేని బెంగ కలుగుతుంది. బహుభాషారాష్ట్రమైన హైద్రాబాదు ముఖ్యమంత్రిగా అనేకుల సహాయం, ఆదరానురాగాలూ నేను పొందగలిగాను. ఆఖరు హైద్రాబాదు ముఖ్యమంత్రిగా వారికి నా ధన్యవాదా లర్పిస్తున్నాను. నక్షామీద గీతలు గీసి, రంగు మార్చినంతలో హృదయాలు, జీవిత సూత్రాలూ మారిపోవు. భారత దేశపు ఆత్మ ఒకటిగా వున్నంత వరకు లోలోపల మనం ఎన్ని మార్పులు చేసుకున్నా భయంలేదు. నూతన ప్రదేశ నిర్మాణానంతరం కొత్త ఎన్నికలు జరుగుతాయి. ఇటువంటి సంధి సమయంలో, మన జాతి పురోగమనం సంతృప్తికరంగా వున్నదన్న విశ్వాసం మనకు శ్రీరామరక్ష. తొమ్మిది సంవత్సరాలు చరిత్రలో ఒక చిటిక. ఆ కాస్తలో మనం ఇంతముందుకి పోగలగడం పదవ స్వాంతత్ర్య దినోత్సవ సందర్భంలో మననం చేసుకోదగిన మహత్కార్యం. ఇది ప్రారంభం మాత్రం. ఇంకా జరగవలసినవెన్నో వున్నాయి. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న సనాతన సుశ్లోకమే మనకి మార్గదర్శి.

జైహింద్.

*(ఆలిండియా రేడియో, హైద్రాబాదు, సౌజన్యంతో)*

కస్తూర్బా కేంద్రముల సేవ:

# గ్రామాలలో కళాకాంతులను వెల్లివిరియ జేయడానికి గ్రామసేవికలు చేస్తున్న కృషి

కేవలం మాటలతోగాక నిజమైన సేవారూపంలో కస్తూర్బా గాంధీకి అంజలి ఘటించడంలో హైదరాబాదు రాష్ట్రం ఇతర ప్రాంతాలకు ఏమాత్రం వెనుకబడిలేదు.

కస్తూర్బా గాంధి ౧౯౪౪ ఫిబ్రవరి ౨౨ వ తేదీన కాలధర్మం చెందిన తరువాత హైదరాబాదు రాష్ట్రం జాతీయ స్మారకనిధికి రూ. ౫౬,౦౦౦ లు విరాళ మిచ్చింది. ఇక్కడ కస్తూర్బా స్మారకనిధి శాఖ ఒకటి తెరువబడింది. జాతీయ స్మారకనిధి కేటాయించిన నిధులేగాక, ఈ శాఖ స్థానికంగా కూడా విరాళాలు సేకరించింది. గత ఎనిమిది సంవత్సరాలనుంచి ఈ శాఖ రాష్ట్ర గ్రామీణ ప్రాంతాలలో అనేక గ్రామసేవా కేంద్రాలను, ప్రసూతి కేంద్రాలను నిర్వహిస్తున్నది. ప్రతి సంవత్సరం రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో మహిళా కార్యకర్తలకు, మంత్రసానులకు శిక్షణ సౌకర్యాలు కూడా కల్పిస్తున్నది. ప్రస్తుతం కస్తూర్బా స్మారకనిధిశాఖ ఇట్టి కేంద్రాలను తొమ్మిదింటిని నడిపిస్తున్నది. ఈ కేంద్రాలలో వయోజన విద్యా తరగతులు నడుపుట, నూలు వడుకుట, కుట్టుపని నేర్పుట, పారిశుధ్యపుపని, సామాజిక ప్రార్థనలు జరుపుట, గ్రామస్థులకు రామాయణము మున్నగు గ్రంథాలనుంచి శ్లోకాలు పద్యాలు చదివి వినిపించుట, అస్పృశ్యతా నివారణకు కృషి చేయుట మున్నగు కార్యక్రమములు అమలుపరచబడుతున్నవి.

## హైదర్షా కోట్ కేంద్రం

రాష్ట్రంలో పోలీసు చర్యకు పూర్వం కొంతమంది బాలికలను వివిధ రాష్ట్రాలకు శిక్షణకొరకై పంపడం మినహా, ఎక్కువ కృషి జరుగలేదు. అసలు కార్యక్రమం ౧౯౪౯ ఫిబ్రవరి ౨౫ వ అంటే కస్తూర్బా వర్ధంతినుంచి ఆరంభమైంది. ఆరోజు హైద్రాబాదుకు ౮ మైళ్ళ దూరంలోఉన్న హైదర్షా కోట్ అను కుగ్రామంలో మొదటి ప్రసూతి కేంద్రం తెరువబడింది. అదే సంవత్సరం జూన్ ౧ వ తేదీన అక్కడ ఒక గ్రామసేవా కేంద్రం కూడా తెరువబడింది. ఈ రెండు కేంద్రాలు ఒక స్థానికవ్యక్తి విరాళమిచ్చిన భవనంలో స్థాపించబడినాయి. ప్రసూతి కేంద్రంలో శ్రీమతి పి. రామాబాయి మంత్రసానిగా నియమించబడింది. జనానా ఆసుపత్రికి చెందిన డా. మిస్. యం. కె. నాయుడు ఈ కేంద్రానికి వారాని కొకసారి వెళ్లి తగు సహాయమిచ్చేది. ౧౯౪౯ సంవత్సరంలో ఈ ప్రసూతి కేంద్రపు రికార్డు ఇది: కాన్పులు ౪౦. చికిత్సపొందిన గర్భిణీస్త్రీల సంఖ్య ౨౧౨. బాలింతల సంఖ్య ౧౬౮. చికిత్సపొందిన సాధారణ రోగుల సంఖ్య ౧౧౪౨. అంటువ్యాధుల కాలంలో నిరోధక చర్యగా ప్రజలకు ప్లేగు, కలరా, టైఫాయిడు మున్నగు సూదిమందులివ్వబడినవి. ౧౯౫౦ సంవత్సరంలో హైదర్షా కోట్ కేంద్రంలో ౯౯౪ మంది రోగులకు వైద్య చికిత్స చేయబడింది. ౨౪ కాన్పులు జరిగినవి. ౧౩౩ మంది గర్భిణీ స్త్రీలకు ౧౮౦ మంది బాలింతలకు చికిత్స జరిగింది. అంతేగాకుండా ఈ కేంద్ర వైద్య సిబ్బంది ౩౩ గ్రామాలను దర్శించింది. ౨౨౪ పర్యాయాలు పారిశుధ్యపు పనులు నిర్వర్తించింది. శ్రీమతి యం. కె. వెల్లోడి, నవాబ్ బసాలత్‌జా బహదుర్ ఈ కేంద్రాన్ని దర్శించి, అది నిర్వహిస్తున్న పనిని ప్రశంసించినారు.

౧౯౫౧ సంవత్సరంలో కూడా ఈ కేంద్రం గణనీయమైన కృషి చేసింది. ౧౦౯౬ మంది రోగులకు చికిత్స చేసింది. ౧౪౬ మంది గర్భిణీ స్త్రీలను, ౧౧౩ మంది

హైదర్షా కోట్‌లో కస్తూర్బా శిక్షణకేంద్రం భవనం.

బాలింతలను వైద్యపరీక్ష చేసింది. ౩౮ కాన్పులు చేసింది. ౨౨౦ పర్యాయాలు పారిశుధ్యపు పనులు నిర్వహించింది.

౧౯౫౨ సంవత్సరంలో డా. మిస్. యం. కె. నాయుడు మాత్రమేగాక డా. శ్రీమతి ఎ. మాధవన్ ఆ తరువాత డా. శ్రీమతి ఆర్. కె. భండారీ గారలు కూడా ఈ కేంద్రానికి సహాయపడినారు. ౧౯౫౩ సంవత్సరంలో ఈ కేంద్రంలో ౨౪౩౯మంది రోగులు, ౨౦౧మంది గర్భిణీస్త్రీలు, ౧౫మంది బాలింతలు చికిత్సపొందినారు. ఈ కేంద్రంలో ౨౮ కాన్పులు కూడా చేయబడినవి. కేంద్ర మంత్రసాని గ్రామ పారిశుధ్యపు పని సందర్భంలో ౧౧౫ ఇండ్లకు వెళ్ళి రోగులకు పరిచర్యలు చేసింది. ౧౯౫౪సంవత్సరంలో ఆదిలాబాదుజిల్లాలోని సంక్షేమ వికాస కేంద్రాలలో హెల్త్ సర్వే చేయుటకు ఈ కేంద్ర మంత్రసాని అక్కడికి డిప్యూట్ చేయబడింది. గ్రామస్థులు తమ ప్రాంతానికి ఒక మంత్రసాని ఉండడం అవసరమని భావించి అందుకై కస్తూర్బా స్మారకనిధి హైద్రాబాదుశాఖ ప్రతినిధికి ఒక విజ్ఞప్తి చేసినారు. ౧౯౫౫ జనవరినుంచి వారికి ఈ సౌకర్యం కల్పించబడింది.

హైదర్షా కోట్‌లోని గ్రామసేవా కేంద్రం శ్రీమతి యస్. సుభద్రాదేవి ఆధ్వర్యాన పనిచేసింది. ఈమె సీతానగరంలో గ్రామ సేవిక పనులలో శిక్షణ పొందింది. ఈ కేంద్రంలో వయోజన విద్యా తరగతులు నడిపించబడుతున్నవి. ఈ తరగతులలో నూలువడకుట, తెలుగు, హిందీ, లెక్కలు మున్నగునవి బోధించబడుతాయి. వయోజనులందరూ గ్రామ పారిశుధ్యపు పనులలో పాల్గొంటారు. ఈ కేంద్రానికి ఆర్గనైజరుగా శ్రీమతి కేశవమ్మ, అసిస్టెంటుగా శ్రీమతి సుబ్బమ్మ గారలు నియమింపబడినపుడు బోధనా తరగతులలో ఎంబ్రాయిడరీ కూడా ప్రవేశపెట్ట బడింది. ఆగస్టు ౧౫ న క్రొత్తగా నిర్మింపబడిన ఒక హాలు తెరువబడింది. ఏప్రిల్ నెలలో రాష్ట్రం నలుమూలలనుంచి సర్వోదయ శిబిరానికి వచ్చిన ౨౦౦ మంది కార్యకర్తలు ఈ కేంద్రాన్ని దర్శించి, వానిని ప్రశంసించారు.

కస్తూర్బా స్మారక నిధియొక్క జనరల్ సెక్రటరీ శ్రీమతి సుశీలాపాయ్ ౧౯౫౨ జూలై ౩౧ న హైదర్షా కోట్‌ను దర్శించింది. మరుసటిరోజు నందికంది కేంద్రాన్ని

కూడా దర్శించింది. శ్రీ అన్నారావుగారు ౧౯౫౭ ఏప్రిల్ ౫ వ తేదీన హైదర్షా కోట్‌ను తలవని తలంపుగా తనిఖీచేసి, ఆ కేంద్రంలో పని సంతృప్తికరంగా కొనసాగుతున్నదని కనుగొన్నారు.

హైదర్షా గ్రామం నిర్బంధ విద్యా ప్రాంతంలో చేర్చుకో బడిన తరువాత అక్కడ ౧౯౫౫ నవంబరులో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల ఒకటి తెరువబడింది. తత్ఫలితంగా కేంద్రానికి హాజరయ్యేవారి సంఖ్య తక్కువయింది. అందు వల్ల కార్యకర్తలు కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలకు పంప బడినారు.

హైదర్షా కోట్‌లో ౧౯౫౫ సెప్టెంబరు ౨౧ నుంచి ౧౯౫౫ అక్టోబరు ౪ వరకు ఒక రిఫ్రెషర్‌కోర్సు శిబిరం జరుపబడింది. ఈ కోర్సుకు తమిళసంఘ సేవాగ్రాంకు చెందిన శ్రీ ఇ. డబ్ల్యు. ఆర్యనారాయగం ప్రారంభోత్సవం చేశారు. అనేక విషయాలపై ఉపన్యాసాలివ్వడం, ముఖ్య ప్రాంతాలను దర్శించడం మున్నగునవి రిఫ్రెషర్ కోర్సు కార్యక్రమంలో చేర్చుకోబడినవి. ఈ కోర్సు ఆఖరురోజున షా మంజిల్‌లో డా. బి. రామకృష్ణరావుగారు కార్యకర్తల నుద్దేశించి మాట్లాడారు. కేంద్ర దేశాంగ శాఖామంత్రి డా. కె. యన్. కట్జూ కూడా కార్యకర్తల నుద్దేశించి మాట్లాడారు. గ్రామాలలో వారు ఒక మహిళా మండలి ఏర్పాటు చేయాలని ఆయన అన్నారు. గ్రామాలలో పిల్లలను చూచుకొనుటకై తగు ఏర్పాట్లు ఉన్నట్లయితే, గ్రామస్త్రీల సేవకై తమ జీవితాలను అంకితం చేస్తామని కార్యకర్తలు చెప్పినారు. దేశాంగ మంత్రి అందుకు సమాధానమిస్తూ స్మారకనిధి పథ్యుల సమావేశంలో ఈ విషయం చర్చిస్తానని అన్నారు.

హైదర్షా కోట్‌లోని గ్రామసేవా కేంద్ర కార్యకర్త దీర్ఘవ్యాధికి లోనైనందువల్లనూ, ఆ కేంద్ర కృషికి అక్కడి ప్రజలు తగు ప్రోత్సాహ మివ్వకపోవటం వలనూ ౧౯౫౪ మార్చినుంచి డిసెంబరు వరకూ దాని కార్యకలాపాలను నిలిపి వేయవలసి వచ్చింది. అయితే ఆ తరువాత ఇది పునరుద్ధరించ బడింది.



రాష్ట్రంలో ట్రస్టు ప్రతినిధి శ్రీమతి జ్ఞానకుమారి హెడా హైదర్షాకోట్ కేంద్రంలో ప్రసంగిస్తున్నారు.



*కేంద్రవాసుల సమావేశంలో కుమారి పద్మజానాయుడు ప్రసంగించారు.*

రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు ౧౯౫౫ జూలై ౨ వ తేదీన ఇక్కడ రిప్రెషర్ కోర్సుకు ప్రారంభోత్సవం చేశారు. ౧౫ రోజుల వరకు అనేక విషయాలపైన ఉపన్యాసా లివ్వబడినవి. ప్రదర్శనములు ఏర్పాటు చేయబడినవి. కేంద్ర సమాచారశాఖ మంత్రి డా. బి. వి. కేస్కర్ కార్యకర్తల నుద్దేశించి మాట్లాడారు.

## మరిపల్లి కేంద్రం

౧౯౪౯ జూన్ ౧౬ వ తేదీన హైద్రాబాదు నగరానికి ౨౦ మైళ్ళ దూరంలో ఉన్న మరిపల్లి గ్రామంలో గ్రామ సేవా కేంద్రమొకటి తెరువబడింది. ఇక్కడ నడిపించబడుతున్న పిల్లల తరగతులలోను రాత్రి పాఠశాలలలోను విద్యార్థులకు తెలుగు హిందీ లెక్కలు బోధించబడుతాయి. వారికి నూలు వడకడం కూడా నేర్పబడుతున్నది. ఈ కేంద్రం శ్రీమతి సరస్వతీదేవి సహాయంతో శ్రీమతి యస్. వెంకటరత్నం అధ్వర్యాన పనిచేసింది. శ్రీమతి వెంకటరత్నం పీఠాపురంలో గ్రామ సేవికగా శిక్షణ పొందింది. మరిపల్లి పరిసర ప్రాంతంలో కమ్యూనిస్టుల దురంతాలు జరుగుతుండి నందువల్ల ౧౯౫౦ సంవత్సరంలో దీనిని మూసివేయవలసి వచ్చింది. కేంద్రాన్ని మూసివేయుటకు పూర్వం అంటే ౧౯౫౦ ఏప్రిల్ మే నెలల్లో ఇక్కడ ప్లేగు వ్యాపించిన సందర్భంలో కార్యకర్తలు ధైర్య సాహసాలు ప్రదర్శించి గ్రామస్తులకు అనేక విధాల సహాయపడినారు.

## మండ్వి కేంద్రం

ఆదిలాబాదు పట్టణానికి ౨౮ మైళ్ళ దూరంలోఉన్న మండ్వి గ్రామంలో ౧౯౪౯ జూలై ౪ వ తేదీన ఒక బాల్వాడి కేంద్రం తెరువబడింది. ఈ కేంద్రంలో పిల్లలకు, స్త్రీలకు నూలు వడకడం, కుట్టుపని, ఎంబ్రాయిడరీ మున్నగు ఇతర చేతిపనులు బోధించబడుతున్నవి. వీరిలో ఎనిమిది మంది మరాఠీ భాష చదువను, వ్రాయను కూడా నేర్చుకొన్నారు. ఈ గ్రామంలో ఎక్కువగా కొండజాతులవా

రున్నారు. వీరందరూ సాధారణ పారిశుధ్యపు పనిలో పాల్గొంటున్నారు.

మంద్వి కేంద్రంలో వైద్య సహాయానికి కూడా ఏర్పాట్లు చేయబడినవి. ఈ కేంద్రం ఒక అనువైన ఇంటిలో స్థాపించబడింది. శ్రీమతి పార్వతీదేవి గౌర్. ఈ కేంద్రాన్ని నడిపిస్తున్నది. ఈమె బాల్వాడి సంచాలికగా శిక్షణపొందినది. ఈమెకు సహాయంగా శ్రీమతి లక్ష్మిబాయి పనిచేస్తున్నది.

పిల్లలకు ఉచితంగా పాలు సరఫరా చేయుటకుగాను శ్రీ బలరాంజీ పటేల్ రెండు ఆవులను కేంద్రానికి ఇచ్చినారు. గ్రామంలో నివసిస్తున్న గోండులు మహా శివరాత్రి, కస్తూర్బా వర్ధంతి. ఠాకార్ బాపా జయంతి వంటి జాతీయ దినములను చాలా వేడుకతో జరుపుకొంటారు.

౧౯౩౬ సంవత్సరములో సేవాగ్రాంలో జరిగిన రిఫ్రెషర్ కోర్సులో శ్రీమతి పార్వతిగౌర్ ప్రీ-బేసిక్‌లో ప్రత్యేకంగా శిక్షణపొందింది.

మంద్వి కేంద్రంలో పనిచేస్తున్న సేవిక సదా అనారోగ్యంగా ఉండడంవల్ల, ఆ కేంద్రాన్ని మూసివేయవలసివచ్చింది.

## గంజల్లి కేంద్రం

రాయచూరుజిలాలో ౧౯౪౬ డిసెంబరు ౧వ తేదీన రాయచూరుపట్టణమునకు ౧౬ మైళ్ళ దూరంలోవున్న గంజల్లి గ్రామంలో ఒక కేంద్రం తెరువబడింది. గ్రామసేవ, బాల్వాడి వైద్యసేవ ఇవన్నీ ఈ కేంద్ర కార్యకలాపాలలో చేరివున్నాయి. శ్రీమతి సీతాబాయి ఈ కేంద్ర నిర్వాహకురాలిగా నియమింపబడింది. ఈమె సుశిక్షణపొందిన గ్రామసేవిక. ఆయుర్వేద వైద్యంకూడా ఈమెకు తెలుసు. ఇక్కడి పాఠశాలలో చదువుకొను పిల్లలసంఖ్య క్రమేణా పెరిగింది. గ్రామస్థులు విశేషంగా ఆయుర్వేదమందులు ఉపయోగించుచున్నారు. పారిశ్రామిక ధర్మకర్తృత్వనిధివారు ఈ కేంద్రానికి ౨౦ చరఖాలను బహుమానంగా ఇచ్చారు. ఇద్దరు గ్రామస్థులు ౩ న్నర ఎకరాల భూమిని విరాళంగా ఇచ్చారు. ఈ కేంద్ర నిర్వహణకై గ్రామస్థులవద్దనుంచి రూ. ౨౦౦ లు కిమ్మతుచేయు ఆహారధాన్యములు, రూ. ౩౦౦ ల నగదు వసూలు చేయబడింది. ఈ డబ్బుతో కేంద్ర ఉపయోగారమె



*ఈ సంవత్సరం తొలిభాగంలో శ్రీ. శే. జి. వి. మవలంకర్ కేంద్రాన్ని దర్శించి ప్రసంగించారు.*



*శ్రీ మవలంకర్ రాకకు జ్ఞాపకార్థంగా కేంద్రంలో ఒక మామిడిమొక్క నాటబడింది.*

గుడిసెలు నిర్మించబడినాయి. ౧౯౫౦ డిసెంబరు ౭ వ తేదీన బి. రామకృష్ణరావుగారి అధ్యక్షతన కేంద్ర వార్షికోత్సవం జరుపబడింది.

ఈ కేంద్రంలో ౧౯౫౧ ఫిబ్రవరి ౨౧ నుంచి మార్చి ౩ వరకు కస్తూర్బా సప్తాహం జరుపబడింది. ఇక్కడ ఒక రిఫ్రెషర్ కోర్సుకూడా జరుపబడింది. ఇందులో రాయచూరు నుంచి ౧౧ మంది ఉపాధ్యాయినులు పాల్గొన్నారు. చరిత్రను గూర్చి కస్తూర్బా నిధియొక్క ఆశయాలు, గ్రామస్థులకు సేవచేయవలసిన పద్ధతులు, వృత్తివనులు, తాటియాకులు, పేము, రంగులద్దకం, వ్యాయామశిక్షణ, సూర్య నమస్కారములు మున్నగు విషయములనుగూర్చి ఉపన్యాసము లివ్వబడినవి. ఈ సందర్భములో నేతవస్త్రములు, రంగులద్దిన వస్త్రముల ప్రదర్శనకూడా ఏర్పాటుచేయబడింది. ఇంజనీరింగు రీసర్చి లేబరేటరీలవారు తయారుచేసిన 'పొగరాలని పొయ్యి' కూడా ప్రదర్శించబడింది. శ్రీ యస్.వి. రాజు ఈ పొయ్యిని ఉపయోగించు విధానాన్ని గ్రామస్తులకు తెలియచేశారు.

ఆబ్కారిశాఖామంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డిగారు ౧౯౫౩ ఫిబ్రవరిలో గంజల్లి కేంద్రాన్ని దర్శించారు.

ఈ కేంద్ర సహాయక సంఘంవారు స్థానిక ప్రజల విరాళాల సహాయంతో రూ. ౪౫౦౦ ల ఖర్చుతో ఒక భవనాన్ని నిర్మించారు. ఒక పోషణశాల, ఒక ప్రసూతిగృహం కస్తూర్బా నిధిచే నిర్మించబడుతున్నవి. ఈ భవనం స్థానిక అభివృద్ధి పథకం క్రింద నిర్మించబడుతున్నది. ఈ సహాయక సంఘంవారు స్థానిక అభివృద్ధి పథకం క్రింద చేర్చబడిన ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల భవన నిర్మాణంలోను గ్రామానికి, కేంద్రానికి మధ్యనున్న కాలవపైగల వంతెన నిర్మాణంలోనూ సహాయపడినారు. కస్తూర్బా స్మారకనిధికై విరాళాల ద్వారా ౩౨ ఎకరాల భూమిని సేకరించగలిగారు. ఈ భూమినుంచి వచ్చే ఆదాయం గ్రామసేవ, ప్రసూతి కేంద్రముల నిర్వహణ ఖర్చుకై వినియోగించబడుతుంది.

౧౯౫౪ నవంబరు ౨౯ తేదీన ఠక్కార్ బాపా జయంతి సందర్భంలో రెవిన్యూశాఖ ఉపమంత్రి శ్రీ వి. హనుమంత రావుగారు ప్రసూతిగృహ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

డా. శ్రీమతి విజయం తరచుగా ఈకేంద్రాన్ని దర్శిస్తుంది.

మెదకుజిల్లా కొండాపూరులో ౧౯౫౦ జూన్ ౪ తేదీన ఒక బాల్వాడి కేంద్రం ఆరంభించ బడింది. ఈ కేంద్రంలో శ్రీమతి రుక్మిణీదేవి, శ్రీమతి అనసూయాదేవి గారలు గ్రామ సేవికలుగా పనిచేశారు.

హైద్రాబాదు జిల్లాలోని సర్దార్ నగరులో ౧౯౫౦ జూలై ౧ వ తేదీన గ్రామసేవా కేంద్రం ఒకటి తెరువబడింది. భారత సాంఘిక సేవా మహాసభయొక్క హైద్రాబాదుశాఖ ఈ కేంద్రానికి అవసరమైన ఆర్థిక సహాయం చేస్తున్నది. ఇది కస్తూర్బా నిధి పర్యవేక్షణ క్రింద వున్నది. శ్రీమతి శంకరదేవి ఈ కేంద్రంలో గ్రామ సేవికగా పనిచేసింది.

## రాకాసిపేట కేంద్రం

౧౯౫౦ అగస్టు ౮ వ తేదీన నిజామాబాదు జిల్లాలోని రాకాసిపేటలో ఒక కేంద్రం తెరువబడింది. ఈ కేంద్రం కృషిఫలితంగా కొంతమంది గ్రామస్థులు పొగాకు, కల్లు అల వాట్లను విడిచిపెట్టారు. అప్పుడు హైద్రాబాదు ప్రధాన న్యాయ మూర్తిగా పనిచేస్తూ వుండిన శ్రీ ఆర్. యస్. నాయక్ ౧౯౫౦ డిసెంబరులో ఈ కేంద్రాన్ని దర్శించి పిల్లలకు మిఠాయి పంచపెట్టడానికై రూ. 50 లు విరాళమిచ్చారు. ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసుకమిటీ ప్రధానకార్యదర్శి శ్రీ ఓబులరెడ్డిగారు కూడా ఈ కేంద్రాన్ని దర్శించారు. శ్రీమతి శ్రీపాద వెంకట రత్నం, శ్రీమతి సుశీలాదేవిగారలు ప్రియసేవికలుగా పని చేశారు.

## రాయగిరి కేంద్రం

సర్వేలులో స్థానిక ప్రజలు కేంద్రాన్ని తగినంతగా ప్రోత్సహించక పోవడంవల్ల ౧౯౫౩ సంవత్సరంలో అది భోనగిరి తాలూకాలోని రాయగిరి గ్రామానికి మార్చబడింది. ఇక్కడ ౧౯౫౪ జూలైలో ఒక ప్రసూతిగృహం తెరువ బడింది. రాయగిరిగ్రామం నల్లగొండ జిల్లాలోని సంక్షేమ విస్తృత ప్రాజెక్టు ప్రాంతానికి సమీపంలో ఉన్నది. రాయగిరి



డా. చెన్నారెడ్డిగారితో సంభాషిస్తున్న శ్రీ జి. వి. మవలంకర్.



*కేంద్రవాసులు సమర్పించిన గౌరవవందనాన్ని స్వీకరిస్తున్న శ్రీ జి. వి. మవలంకర్.*

కేంద్రంలో పనిచేస్తున్న మంత్రసాని, ప్రాజెక్టు ప్రాంతంలో ప్రసూతి, వైద్యసహాయకపనులను నిర్వహిస్తున్నది. ఈమె ప్రాజెక్టుఆచరణసంఘానికిజాయింటుకన్వీనరుగాపనిచేస్తున్నది. ప్రాజెక్టు కార్యాలయం ఈ కేంద్రం తరఫున ఒక సంఘంచే నిర్వహించబడుతున్నది. ౧౯౫౪ డిసెంబరునెలలో నల్గొండ కలెక్టరు,సాంఘికకృషిలో శిక్షణపొందుటకువచ్చిన౨౬మంది విద్యార్థినులు శిబిరాన్నొకదానిని ఏర్పాటు చేశారు. కస్తూర్బా సేవికలు భోనగిరి డిప్యూటి కలెక్టరు సహకారంతో ఈ శిబిరాన్ని ఏర్పాటుచేశారు. కస్తూర్బా కార్యకర్తలు విద్యార్థినులకు గ్రామ పారిశుధ్యం, ఆరోగ్యం, గ్రామస్త్రీలలో సాంఘిక విద్యావ్యాప్తి, నూలువడకడం, సాంస్కృతిక కార్యకలాపాలు మున్నగు విషయాలలో శిక్షణ ఇచ్చారు. విద్యార్థినులు చేసిన కృషిని ప్రశంసిస్తూ వారికి ప్రభుత్వం బహుమతు లిచ్చింది.

యాదగిరి నరసింహస్వామి దేవాలయంలో జాతర జరిగినప్పుడు, హైద్రాబాదు రాష్ట్రంలో కస్తూర్బా నిధివారి కార్యకలాపాలను, నల్గొండ జిల్లాలోని సంక్షేమ విస్తృత ప్రాజెక్టు క్రింద జరిగిన కృషిని తెలుపు ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ ప్రదర్శనాన్ని చూచుటకు ప్రజలు అసంఖ్యాకంగా వచ్చారు. నృసింహస్వామి దేవాలయంలో సేవికలు బాలల విభాగాన్ని కూడా ఏర్పాటు చేశారు. దేవాలయాన్ని కానీ, ప్రదర్శనాన్నికానీ చూచుటకు వెళ్లువారు తమ పిల్లలను ఈ విభాగంలో విడిచిపెట్టిపోవుటకు ఏర్పాట్లు చేయబడినవి. తలిదండ్రులు తమ పిల్లలను తీసికొనిపోవువరకు గ్రామసేవికలు వారిని కాపుకాస్తుంటారు. ౧౯౫౪ జనవరిలో కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతంలో మిర్యాపూరులో ఒక గ్రామసేవాకేంద్రం తెరువబడింది. ఈ కేంద్రంఉపయోగానికై ఒక భవనం నిర్మించబడింది. ఇది ౧౯౫౫ మే ౨౬న తెరువబడింది.

### బరూరు కేంద్రం

కొండాపూరు - నందికొండ కేంద్రాన్ని స్థానికప్రజలు ప్రోత్సహించనందువల్ల అది ౧౯౫౦ జనవరి ౪ వ తేదీన

బీదరు తాలూకాలోని జాతీయ విస్తరణ కేంద్రంలో ఉన్న ఐరూరు గ్రామానికి మార్చబడింది. కేంద్రాన్ని ఏర్పాటు చేయుటకుగాను ఐరూరు గ్రామస్థులు జాతీయ విస్తరణ కార్యక్రమంక్రింద రూ. ౩౦౦౦ ల ఖర్చుతో ఒక భవనాన్ని నిర్మించారు. స్థాపించబడిన కొద్దికాలంలోనే ఈ కేంద్రం స్థానిక ప్రజల మన్ననకు పాత్రమయింది. ఇప్పుడు ఈ కేంద్రం పరిసరగ్రామాలకు ఎంతో సహాయకారిగాఉన్నది. ఈకేంద్ర కృషివల్ల బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, గ్రామస్థులు ఆసక్తి చూపుతున్నారు.

కస్తూర్బా కేంద్రాలన్నింటిలో గాంధిజయంతి, కస్తూర్బా వర్ధంతి, థాకార్‌బాపా జయంతివంటి ముఖ్యమయిన జాతీయ దినములు వేడుకతో జరుపబడతాయి. ఇట్టిరోజులలో ప్రార్థనలు, నృత్యములు, గ్రామ పారిశుధ్యం, చెట్లు నాటడం మున్నగు కార్యక్రమాలు జరుపబడుతాయి. నిర్మాణాత్మక పనులవల్ల శ్రద్ధగల నాయకులు కేంద్రాలను దర్శించి, అవి చేస్తున్నపనిని ప్రశంసిస్తున్నారు. ౧౯౫౦ సంవత్సరములో హైద్రాబాదు రాజప్రముఖు కస్తూర్బా నిధికి రూ. ౨౦,౦౦౦ లు విరాళమిచ్చారు.

కస్తూర్బానిధి చైర్మెన్‌గా ఉండిన సర్దార్‌పటేల్ ౧౯౫౦ అక్టోబరు ౧ తేదీన హైద్రాబాదు నిధి కార్యకర్తల నుద్దేశించి మాట్లాడుతూ ఇలాఅన్నారు: "నాహృదయమెప్పుడు గ్రామాలపై ఉన్నది. అయితే కార్యభారంవల్ల నేను ఢిల్లీలోనే ఉండవలసివస్తున్నది. పరిస్థితులు చాలా సున్నితంగా ఉండడంవల్ల బాధ్యతలనుంచి వైదొలగుటకుకూడా సాధ్యం కాకుండా ఉన్నది. గ్రామాలలో చేయవలసినపని ఎంతో ఉంది. విశేషంగా హైద్రాబాదులో ఎక్కువ కృషి చేయవలసిఉంది. ఇక్కడ ఇంతవరకు గ్రామ సంక్షేమానికై ఎలాంటి యత్నం కూడా చేయబడలేదు. ప్రభుత్వంగానీ, కాంగ్రెసుకానీ ఏమీ చేయలేదు. ఏదో ఒకవిధంగా మీరు పని ఆరంభించినారు. ధైర్యంతో ఈపనిని మీరు కొనసాగించండి."

హైదర్షాకోట్‌లో 'బాలసర్కార్' అంటే పిల్లల ప్రభుత్వ ఉపప్రధాని అంబయ్య ౧౯౪౯ అక్టోబరు ౩౧ వ తేదీన సర్దారుకు ఆయన జన్మదినమునాడు ఖాదీ వస్త్రములను బహుమతిగా ఇచ్చినారు. వివిధ కేంద్రాల కార్యకర్తలు, పిల్లలు ఈ ఖాదీ వస్త్రములు పంపినారు.

౧౯౫౦ నవంబరులో భారత ప్రధాని నెహ్రూకు ఆయన జన్మదినంనాడు హైద్రాబాదుశాఖ ౬౧ కండెల నూలుతో నేయబడిన ఖాదీ వస్త్రములు పంపింది.

ఈ కేంద్రాలన్నిటిలో పిల్లలు స్వయంగా 'మంత్రివర్గాన్ని', అసెంబ్లీలను ఏర్పాటు చేసుకున్నారు. కస్తూర్బానిధి యొక్క హైద్రాబాదు శాఖ ప్రతినిధి శ్రీమతి జ్ఞానకుమారి హెడా, ఆర్గనైజరు శ్రీమతి ఐ. కేశవమ్మ తరచుగా వివిధ కేంద్రాలను పరిశీలిస్తారు.

౧౯౫౧ సంవత్సరంలో హైదర్షా కోట్, మండ్వీ కేంద్రాలలో కస్తూర్బా సంచారక దళములు పనిచేయ నారంభించినవి. ఆ తరువాత ఈ పథకం రాయచూరు, గంజల్లి, రాకాని పేటలకు కూడా విస్తృతపరచ బడింది.

కస్తూర్బా నిధి శాఖలో పనిచేస్తున్న సేవికలు శ్రీ యం. నరసింగరావు ప్రభృతులతోపాటు ఉస్మానాబాదు జిల్లాలో కాందిశీకుల పునరావాస కృషికి తోడ్పడినారు.

కస్తూర్బా కేంద్ర సేవికలు గ్రామీణ ప్రజానీకంతో కలసిమెలసి తిరుగుతూ, వారు జరుపు పండుగలు, వేడుకలలో పాల్గొంటున్నారు. ఈ విధంగా సేవికలు గ్రామస్థుల ఆదరాభిమానాలను చూరగొన్నారు. ౧౯౫౧ సంవత్సరంలో శివరాంపల్లిలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో వారు పాల్గొన్నారు. వారు బొలారంలోని ప్రకృతి చికిత్సా శిబిరంలో కూడా పనిచేశారు. ఆచార్య వినోబాభావే శివరాంపల్లిని దర్శించినపుడు సేవికలకు కొన్ని ఉపయోగకరమైన సలహాలిచ్చారు. ఆయన సర్వేలు, మండ్వీ గ్రామాలలోని కస్తూర్బా కేంద్రాలను కూడా దర్శించారు.

రాష్ట్రమంత్రులు, అధికారులు, ఇతర నాయకులు తమ తమ పర్యటనల సందర్భంలో వివిధ కేంద్రాలను దర్శిస్తూ అవిచేయు పనికి తగు ప్రోత్సాహమిస్తున్నారు.

పండిత నెహ్రూ ౧౯౫౪ జనవరి ౩ వ తేదీన కస్తూర్బా నిధి కార్యకర్తలను, భారతసేవక సమాజ కార్యకర్తల నుద్దేశించి మాట్లాడుతూ సేవికలు చేస్తున్న కృషిని ప్రశంసించారు. ప్రభుత్వ సంస్థలలోను, ప్రజా సంస్థలలోను పని చేయు వ్యక్తులు ఈ కార్యకర్తలకు సహాయపడ వలసిందిగా వారిని కోరారు.

కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం ౧౯౫౪ ఆగస్టు ౧౫ న సంక్షేమ విస్తరణ ప్రాజెక్టుల పథకాన్ని అమలు పరచింది. హైద్రాబాదుకు ౧౦ ప్రాజెక్టులు కేటాయించబడినవి. హైద్రాబాదు రాష్ట్రంలోని కస్తూర్బానిధి యాజమాన్యం క్రింద నల్గొండజిల్లాలో ౨౦ గ్రామాలు, ఆదిలాబాదు జిల్లాలో ౧౦ గ్రామాలతోను కూడియున్న రెండు ప్రాజెక్టులు పనిచేస్తున్నవి. కస్తూర్బా నిధిశాఖ ప్రాజెక్టు ప్రాంతాలకు ఏడుమంది శిక్షణపొందిన సేవికలను పంపింది. అంతేగాక పై ప్రాజెక్టులకు వరుసగా రూ. ౩౪౬ లు, రూ. ౪,౦౬౩ లు కూడా విరాళమిచ్చింది. హైద్రాబాదు రాష్ట్ర కస్తూర్బానిధి ప్రతినిధిచే సేకరించబడిన విరాళంలో నుంచి ఈ డబ్బు కేటాయించ బడింది.

[తరువాయి ౩౩వ పుటలో]

# హైదరాబాదులో బంజారాలు

రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ ఇటీవల హైద్రాబాదులో కొన్నాళ్లు గడిపిన సందర్భంలో రాష్ట్రపతి నిలయంలో లంబాడిస్త్రీలతో కలిసి తేనీరు సేవించారు. కొన్ని ముఖ్యమైన చేతి పనులలో ప్రత్యేక నిపుణతగల ఈ కొండ జాతి వారికి అది ఎంతో గర్వకారణమైన దినం.

రాష్ట్రంలోని మూడు భాషా ప్రాంతాల లోను నివసించే లంబాడీల యోగక్షేమాలను విచారించడానికై 'సేవాసంఘం' అనే ఒక సంస్థ కలదు. అయితే ఈ జాతివారు సువ్యవస్థితులై వున్నారనడానికి మాత్రం వీలులేదు.

'బంజారా సేవా సంఘా'నికి చెందిన కొందరు నాయకులు ౧౯౫౬ జూలై ౬ వ తేదీన రాష్ట్రపతి నిలయంలో భారత రిపబ్లిక్ అధ్యక్షులను సందర్శించి, ప్రస్తుతం వెనుకబడిన తరగతిగా వ్యవహరించ బడుతున్న తమ జాతిని 'కొండజాతులలో' చేర్చవలసిందని కోరుతూ వారికి ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు.



హైదరాబాదులోని మూడు భాషాప్రాంతములకు చెందిన బంజారా సేవాసంఘ నాయకులు రాష్ట్రపతిని దర్శించినదృశ్యం.

౧౯౫౧ సంవత్సరపు జనాభా లెక్కలను బట్టి రాష్ట్రంలో ౫,౬౩,౪౧౨ మంది బంజారాలు కలరు. వీరినే లంబాడీలు, లమానీలు అని కూడా అంటారు. వీరందరూ సుమారు ౬౦౦ తండాలలో వున్నారు. ప్రతి జిల్లాలోను వీరి సంఖ్య దిగువ చూపబడింది:

| | | |
|---|---|---|
| ౧. | ఔరంగాబాదు | ౨౨,౬౨౯ |
| ౨. | పర్భనీ | ౨౨,౦౧౮ |
| ౩. | నాందేడు | ౨౦,౩౬౧ |
| ౪. | బీదర్ | ౧౭,౯౨౮ |
| ౫. | బీడ్ | ౧౧,౯౦౨ |
| ౬. | ఉస్మానాబాదు | ౭,౨౬౩ |
| ౭. | హైద్రాబాదు | ౮,౫౭౪ |
| ౮. | మహబూబ్ నగర్ | ౫౮,౮౮౭ |
| ౯. | రాయచూరు | ౧౪,౧౭౬ |
| ౧౦. | గుల్బర్గా | ౬౨,౭౯౦ |
| ౧౧. | ఆదిలాబాదు | ౩౫,౫౧౮ |
| ౧౨. | నిజామాబాదు | ౨౩,౮౭౧ |
| ౧౩. | మెదక్ | ౧౬,౭౬౨ |
| ౧౪. | కరీంనగర్ | ౧౨,౦౪౪ |
| ౧౫. | వరంగల్ | ౧౩౪,౪౨౦ |
| ౧౬. | నల్గొండ | ౮౪,౨౬౮ |

బంజారాలు పూర్వం పశువుల కాపరులు. వీరు క్రీ. శ. ౧౬౩౦ వ సం. లో రాజస్థాన్ లోని మార్వార్ నుంచి ఈ ప్రాంతానికి వలస వచ్చినారు. వీరు స్థిరంగా ఒకచోట తమ నివాసాలను ఏర్పరచుకొనక తమ పశువులకు సరిపడు గ్రాసం లభ్యమయే ప్రదేశాలలో తాత్కాలికంగా నివాసాలను ఏర్పరచుకొనెడి వారు. ఈజాతివారు క్రమేణా ఉప్పు, ఆహారధాన్యాలు ఆముదాల వర్తకం మొదలగు వృత్తులను అవలంబించారు.

దేశంలో రైలు మార్గాలు ఏర్పడడంతోనే దూర దూర ప్రాంతాల మధ్య కూడా వివిధ సరకుల రవాణా సులభంగాను, చురుకుగాను కొనసాగుతున్నందువల్ల ఈ జాతివారి వృత్తికి దెబ్బతగిలింది. ఫలితంగా వీరు స్థిరనివాసాలు ఏర్పరచుకొనవలసిన పరిస్థితి ఏర్పడింది. అయితే రాజకీయంగా కల్లోల పరిస్థితులు ఉండడంచేత ఇతర కారణాలవల్ల వీరు ఆ విధంగా స్థిరనివాసాలు ఏర్పాటుచేసుకోలేక పోయ్యారు. క్రీ. శ. ౧౮౯౬ వ సం. లో ఈ జాతివారు నేరస్థజాతిగా ప్రకటించబడినారు. దీని పర్యవసానంగా ఆర్థికంగా, సాంఘికంగా, విద్యావిషయకంగా వీరు దురవస్థలకు లోనయ్యారు. కాని ౧౯౫౨ వ సం. పు నేరస్థ జాతుల చట్టం రూపొందడంతో ఈ జాతివారు సుఖజీవనాన్ని గడపడానికి అవకాశాలు ఏర్పడినాయి.

బహు సంఖ్యలోవున్న ఈ జాతివారు ౫౫ సంవత్సరాలపాటు 'నేరస్థుల' క్రింద లెక్కచేయబడినందున వీరిలో కొండజాతుల లక్షణాలు పెంపొందాయి. కనుక వీరి సమస్యలను ఆ దృష్టితోనే పరిష్కరించవలసి వచ్చిందని పై విజ్ఞాపన పత్రంలో పేర్కొనబడింది. ప్రస్తుతం వీరు వెనుకబడిన తరగతుల క్రిందనే చేర్చబడినారు. కాని కొండజాతులుగా పరిగణించబడినట్లయితే వీరి అభివృద్ధికి చక్కని అవకాశాలు, సౌకర్యాలు ఏర్పడగలవని వీరు అభిప్రాయపడుతున్నారు.

# హైదరాబాదు డైరీ



౧౯౫౬, జూలై

౧. రాష్ట్రపతి నిలయాన్ని సుందరంగా అలంకరించడంలో సహాయపడిన దాదాపు ౪౦౦ మంది కళాకారులకు, వృత్తి పనివారలకు రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ స్వాగతమిచ్చారు.

౨. హైద్రాబాదులో వేదాంత వర్ధనీ సంస్కృత కళాశాల, ఉన్నత పాఠశాల, విద్యార్థి వసతిగృహం, ప్రాచ్య పరిశోధనాలయం భవనానికి రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు.

౩. రాష్ట్రపతి ఔరంగాబాదు వెళ్లారు.

౪. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ఎల్లోరాగుహలను ఇంకా ఇతర చారిత్రక స్థలాలను సందర్శించారు. సాయంత్రం ఔరంగాబాదులో ఒక బహిరంగ సభలో ప్రసంగించారు.

౫. రాష్ట్రపతి నిలయంలో రాష్ట్రపతి హైద్రాబాదు పురప్రముఖులకు స్వాగతమిచ్చారు.

౬. సామాజికాభివృద్ధి కేంద్రాలను జాతీయ వికాస కేంద్రాలను సందర్శించి, వాటి నిర్వహణ వ్యవహారాలను తెలుసుకునే నిమిత్తం ౧౫ మంది శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులుగల బృందం ఒకటి బీదర్, గుల్బర్గా, ఉస్మానాబాదు, బీడ్, ఔరంగాబాదుజిల్లాలలో ఏడు రోజులు పర్యటన చేసే నిమిత్తం హైద్రాబాదు నుంచి బయలుదేరి వెళ్లింది.

౭. హైద్రాబాదు హిందీ ప్రచార సమ్మేళనానికి రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు.

౮. హైద్రాబాదులో "గాంధీ భవన్"కు రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

౯. హైద్రాబాదులో ౧౬ రోజుల పాటు గడిపిన తరువాత రాష్ట్రపతి ఢిల్లీ వెళ్ళిపోయారు.

౧౦. ఆంధ్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఓ. పుల్లారెడ్డి ఆంధ్రకు తాత్కాలికంగా కేటాయించబడిన హైద్రాబాదు అధికార్ల జాబితాను హైద్రాబాదు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శితో కలిసి పరిశీలిస్తూ నగరంలో ఒక రోజు వున్నారు.

౧౧. "హమారా ఎక్దాం" పత్రిక సంపాదకుడు శ్రీ ఆబిద్ జయిను లాబద్దీన్ రెండు నేరములకు గాను స్థానిక ఛీఫ్ సిటీ మెజిస్ట్రేటుచే ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడినాడు. ప్రజాశాంతిని భంగపరిచే ఉద్దేశంతో హిందూ,మహమ్మదీయుల మధ్య వైషమ్యాన్ని పెంపొందించడానికి పనిచేసినట్లు శ్రీ ఆబిద్ జయిను లాబద్దీన్‌పై నేరం మోపబడింది.

౧౨. హైద్రాబాదు శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనల కేంద్ర ప్రయోగశాల కేంద్ర ప్రభుత్వాధీనం క్రిందికి తీసుకొనబడింది. ఇప్పుడు దీనికి "ప్రాంతీయ ప్రయోగశాల" అని నామకరణం చేయబడింది.

౧౩. హైద్రాబాదు విభజనను సవాలుచేస్తూ శ్రీ శ్రీకిషన్ పెట్టుకున్న రిట్ దరఖాస్తును హైద్రాబాదు హైకోర్టు డివిజన్ బెంచి త్రోసిపుచ్చింది. ఈ దరఖాస్తు సమర్థనీయం కాదనీ, ఇది అనర్హమైనదనీ కోర్టువారు అభిప్రాయపడ్డారు.

౧౪. కేంద్ర డిప్యూటీ విద్యామంత్రి డా. కె. ఎల్. శ్రీమాలీ హైద్రాబాదులో ఒక సమావేశంలో ప్రసంగిస్తూ ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల వేతనాలు పెంచబడనున్నాయనీ ఈ విషయమై రాష్ట్రప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తున్నట్లు హైద్రాబాదువిద్యామంత్రి తనకు నమ్మకంగా చెప్పినారనీ తెలిపారు.

౧౫. ఏర్పడనున్న నూతన రాష్ట్రంలో హైకోర్టు ఎక్కడ స్థాపించాలి అన్న విషయాన్ని ఇంకా ఇతర సమస్యలను చర్చించడానికై ఆంధ్ర, తెలంగాణా నాయకులకు కొత్తఢిల్లీ నుంచి పిలుపు వచ్చింది.

౧౬. హైద్రాబాదులో నెలకొల్పబడవలెనని మొదట ఉద్దేశించబడినట్టి వ్యవహార ప్రయోగశాల,

వ్రేలిముద్రల పరిశీలక సంస్థ, నేర పరిశోధక శిక్షణ పాఠశాల ఇప్పుడు కలకత్తాలో స్థాపించబడగలవు.

౧౭. ఏర్పడనున్న నూతనరాష్ట్రంలో తెలంగాణా ప్రజలకు కల్పించవలసిన రక్షణల విషయమై ఆంధ్ర, తెలంగాణా నాయకుల మధ్య జరిగిన ఒప్పందాలు న్యాయ సమ్మతంగా గౌరవించబడ గలవని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డి ఇక్కడ పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ అన్నారు.

౧౮. కొత్తరాష్ట్రంలో ప్రాంతీయరక్షణలవిషయమై ఆంధ్ర ముఖ్యమంత్రి, తెలంగాణా కాంగ్రెసునాయకులు ఢిల్లీలో కేంద్రహోంమంత్రితో కలిసి చర్చలు జరిపారు.

౧౯. ప్రాంతీయ రక్షణల విషయంలో ఆంధ్ర, తెలంగాణా నాయకుల మధ్య అంగీకారం కుదిరినట్లు ప్రకటించబడింది.

౨౦. విద్యాశాఖ సచివాలయం నుంచి దొంగిలించబడిన సుమారు రూ. ౧౫౦౦లు గల ఒక నగదుపెట్టె, ఇంకా ఇతర పత్రాల కేసు విషయమై నగర పోలీసు క్రైం బ్రాంచివారు ఆరా తీస్తున్నారు.

౨౧. ఆంధ్ర నుంచి తరలించబడే ప్రభుత్వ కార్యాలయాలకు సిబ్బందికి వసతి కల్పించడానికై రూ. ౪౦ లక్షల వ్యయంతో హైద్రాబాదు నగరంలో వెంటనే ౧౫౦౦ గృహాలను నిర్మించడానికి తలపెట్టబడిందని వ్యవసాయ, సరఫరా మంత్రి డా. ఎం. చెన్నారెడ్డి తెలిపారు.

౨౨. ఆంధ్ర, హైద్రాబాదు పి. ఎస్. పి. కార్య నిర్వాహక వర్గ సభ్యుల సమిష్టి సమావేశంలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంత మంతటికీ తమపార్టీ వ్యవహరించడానికై ఒక అడ్ హాక్ కమిటీని ఏర్పాటుచేయడానికి నిశ్చయించారు.

౨౩. హైద్రాబాదు శాసన సభ వర్షాకాలపు సమావేశం ఆరంభమైంది. ఈసమావేశంలో మొదటిరోజున లోకమాన్య బాలగంగాధర తిలక్ శత వార్షిక జయంతి సందర్భంగా ఆ మహానుభావునికి జోహార్లు అర్పించబడినవి.

౨౪. ఒక నిర్ణీతప్రాంతంలోగాని, లేక మార్గంలోగాని, ఇతర వ్యక్తులను పూర్తిగా మినహాయించి గాని, లేక కొంత వరకు మినహాయించిగాని, రోడ్డు రవాణా సర్వీసులను నడుపడానికై స్టేటు ట్రాన్సుపోర్టుకు అవకాశం కల్పించునట్టి మోటారు బండ్ల (హైద్రాబాదు సవరణ) బిల్లు రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టబడింది.

౨౫. భూమి ముక్కచెక్కలు కాకుండా నిరోధించడానికీ, కమతాల ఏకీకరణకూసంబంధించిన ప్రభుత్వ బిల్లు యొక్క ౨౦ క్లాజులను రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.

౨౬. భూమి ముక్కచెక్కలు కాకుండా నిరోధించడానికీ, కమతాల ఏకీకరణకూ సంబంధించిన బిల్లు రాష్ట్ర శాసనసభచే ఆమోదించబడింది.

౨౭. హైద్రాబాదు గృహ నిర్మాణ బోర్డు బిల్లును రాష్ట్ర శాసన సభ ఆమోదించింది.

౨౮. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ౧౯౦(౧) వ సెక్షను క్రింద స్థానిక న్యాయవాది శ్రీ బి. జి. కేస్కార్ కింగ్ కోటీలో పోలీసు దళాలను పోలినట్టి సాయుధ దళాలు వున్నాయని ఆరోపిస్తూ పెట్టిన కేసును హైద్రాబాదు జిల్లా మేజిస్ట్రేటు కొట్టివేశారు.

౨౯. హైద్రాబాదు ఉన్ని పరిశ్రమ పనివారల మహాసభకు రాష్ట్ర వాణిజ్య, పరిశ్రమల మంత్రి ప్రారంభోత్సవం జరిపారు. ఈ మహాసభ రెండు రోజుల పాటు జరిగింది.

౩౦. ఆంధ్ర, తెలంగాణా మంత్రులకమిటీయొక్క తొలి సమావేశం, ౧౯౫౬ ఆగస్టు ౧౯ వ తేదీన జరుగనున్నట్లు కర్నూలు నుంచి వార్త వెలువడింది.

౩౧. రాష్ట్రంలో గనులున్న ప్రదేశాలలో ఉచిత రీతిని పౌర పరిపాలనను నిర్దేశించునట్టి హైద్రాబాదు మైనింగ్ సెటిల్మెంట్ బిల్లును రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.

# వార్తలు - విశేషాలు

## యాద్గీర్ సామాజికాభివృద్ధి బ్లాకు

యాద్గీర్ ప్రజలు, స్థానికసామాజికాభివృద్ధి కేంద్రంలో జరిగే నిర్మాణపనులలో ఉత్సాహంతో పాల్గొంటున్నారు. ఈ సంవత్సరం వనమహోత్సవం సందర్భంలో ఈ కేంద్రంవారు అప్రోచ్ రోడ్ల కిరుప్రక్కలా చెట్లునాటారు. ౩౦౦ ఎకరాల ఒకబ్లాకులో వరదకట్టలు వేసేపనికి జూలై ౭ వ తేదీన వాణిజ్య, పరిశ్రమల ఉపమంత్రి శ్రీ విరూపాక్షప్ప ప్రారంభోత్సవం జరిపారు. ఇట్టివి మరి రెండుబ్లాకులు మాథవర్, టోర్నటిప్పాలలో కలవు. వీటిలో ఒక్కొక్కబ్లాకు క్రింద ౪౦౦ ఎకరాల ప్రాంతం వుంటుంది.

ఉపమంత్రిగారు యాద్గీర్ లో ఒక ధర్మశాలకు, ముందర్గాలో ఒక ఆనకట్టకు పస్పుల్ లో ఒకపాఠశాల భవనానికి పునాది రాయివేశారు.

## సిమెంటు వ్యాపారం

సిమెంటును తయారుచేసే వారి మొత్తం సిమెంటు ఉత్పత్తిని సేకరించడానికీ, సిమెంటుయొక్క ఎగుమతి దిగుమతులను జరపడానికి భారతప్రభుత్వం స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ప్రయివేటు) లిమిటెడ్ అను సంస్థను ఏర్పాటుచేసింది. కనుక ప్రస్తుతంగల సిమెంటు పంపిణీ కంపెనీలు ౧౯౫౬ జూలై ౧ వ తేదీనుంచి పై కార్పొరేషనుకు అమ్మకం ఏజంట్లుగా పనిచేస్తాయి.

౧౯౫౬ జూన్ ౨౬ వ తేదీన చేయబడిన సిమెంటు కంట్రోలు ఉత్తర్వు ననుసరించి ౧౯౫౬ జూలై ౧ వ తేదీనుంచి సంచులతో నింపబడిన సిమెంటు ధర టన్నుకు రూ. ౧౦౭-౮-౦ లు ఎఫ్. ఓ. ఆర్. రేటు చొప్పున వుండగలదు. అన్నివిధములయిన సరఫరాకు ఈ ధర వర్తించగలదు. ఈధరలో టన్నుకు రూ. ౫ లు చొప్పున సెంట్రల్ ఎక్సయిజు పన్నుకూడా వున్నది. కాని హైద్రాబాదు సాధారణ అమ్మకంపన్ను మాత్రం వేరే చెల్లించవలసివుంటుంది.

## ప్రయోగశాల

హైద్రాబాదు శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనల కేంద్ర ప్రయోగశాలను క్రొత్తఢిల్లీ శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనల కౌన్సిలువారు స్వాధీనపరచుకున్నారు: ఇప్పుడు ఈ సంస్థకు "ప్రాంతీయ ప్రయోగశాల, హైద్రాబాదు" అని నామకరణం చేయబడింది.

## తూనికలు, కొలమానముల ఇన్స్పెక్టర్లు

తూనికలు, కొలమానములశాఖ ఇన్స్పెక్టర్లు డ్యూటీపై వున్నప్పుడు ఖాదీ దుస్తులు, 'హెచ్. డబ్ల్యు. ఎం.' అను షోల్డర్ టైటిల్స్‌తోపాటు భుజాలపై మూడు నక్షత్రాలను ధరించి వుండగలరనీ, వారి తలపై పీట్ టోపీగాని లేదా సన్ హ్యాట్‌గాని వుండగలదనీ ప్రకటించబడింది.

## సహాయక గ్రాంటులు

భారతీయ వైద్య విధానాన్ని అనుసరించే చికిత్సాలయాలకు, ధర్మసంస్థలకు సహాయకగ్రాంట్లు ఇవ్వడానికై ౧౯౫౫ వ సం.పు నియమావళి రూపొందించబడింది. ఈ నియమావళిక్రింద సంవత్సరానికి రూ. ౪౨ మొదలు రూ. ౬౫౦ ల వరకు సహాయక

గ్రాంటులను మంజూరుచేయడానికి భారతీయ వైద్య విధానాల డైరెక్టరుకు అధికారం ఇవ్వబడింది. ఈ విధంగా మంజూరుచేయబడేగ్రాంటులో నూటికి ౭౫ వంతుల మేరకు ఔషధాలను ప్రభుత్వ భారతీయ ఔషధాల ఫార్మసీనుంచి సరఫరా చేయడమవుతుంది. మిగతా మొత్తం నగదురూపంలో ఇవ్వబడగలదు. యూనానీ, ఆయుర్వేద విధానానికిచెందని చికిత్సాలయాలు, ధర్మ సంస్థలకయితే సహాయక గ్రాంటు యొక్క పూర్తిమొత్తం నగదురూపంలో చెల్లించబడును.

## విద్యార్థుల విరాళం

పర్భనీ ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల ౭ వ తరగతి విద్యార్థులు రెండవ పంచవర్ష ప్రణాళికకయి రూ. ౭౫-౦-౦ లను విరాళంగా ఇచ్చినందుకు శ్రీ సి. డి. దేశముఖ్ వారిని అభినందిస్తూ, ఆ విధంగా స్వల్పమయిన విరాళాలు ఇవ్వడంకంటే విద్యార్థులంతా స్వయంగా చిన్నమొత్తముల ఉద్యమాన్ని ఆరంభించి చేతనయినంతగా డబ్బును పొదుపుపరచి ఆమొత్తాన్ని సేవింగ్స్ సర్టిఫికెట్లకై పెట్టుబడి పెట్టడం మంచిదని సలహాఇచ్చారు.

## పన్ను మినహాయింపు లేదు

రవాణా కుపయోగింపబడే మోటారుబండ్లుమినహా ఇతర మోటారుబండ్లు ఈ క్రిందిరాష్ట్రాలలో రిజిస్టరు చేయబడివుండి, పన్ను విధింపబడుతున్నట్లయితే వాటిని ౧౯౫౫ సంవత్సరపు హైద్రాబాదు మోటారు బండ్ల పన్ను విధింపు నియమావళియొక్క ౧౬ వ నియమంక్రింద పన్ను విధింపునుంచి మినహాయించడానికి వీలులేదు.

బొంబాయి, పెప్సు—పాటియాల; మధ్యభారత్, రాజస్తాన్, బీహార్, హిమాచలప్రదేశ్, కచ్.

## రక్షిత కౌలుదార్ల జాబితా

౧౯౫౬ వ సం. పు హైద్రాబాదు కౌలుదారీ నియమావళి ననుసరించి ట్రిబ్యూనల్‌వారు తగువిచారణ జరిపి రక్షితకౌలుదార్లుగా పరిగణించబడిన వారి పేర్లతో ఒక తాత్కాలిక జాబితాను సిద్ధంచేస్తారు. అంతేగాక భూకామందులు, ఇతరవ్యక్తులు తెల్పు ఆక్షేపణలను, అభ్యంతరములనుకూడా ట్రిబ్యునల్‌వారు విచారించి, తగు పరిశీలన జరిపినతరువాత సవరణలతోగాని లేదా సవరణలు లేకుండానే అంతిమజాబితాను తయారు చేస్తారు. అట్టి జాబితాను గ్రామచావడీ నోటీసు బోర్డు పయి అంటింపజేయడమేగాక డప్పు ద్వారా గ్రామములో చాటింపుకూడా చేయిస్తారు.

## ఫైనాన్స్ కమీషన్ విచారణ

ఫైనాన్స్ కమీషన్‌వారు ఈ క్రిందివిషయములను గూర్చి రాష్ట్రపతికి తమ సిఫారసులను అందజేయవలెను. (౧) ఆదాయపు పన్నువల్ల వచ్చిన నికరరాదాయాన్ని యూనియన్‌కు, రాష్ట్రాలకు మధ్య పంపిణీ చేయడం, రాష్ట్రాలమధ్య ఒక్కొక్క రాష్ట్రం వాటాను నిర్ణయించడం. (౨) యూనియన్ ఎక్సైజు పన్నులు మొదలగు విభాజ్యమయిన కేంద్రపన్నులను పంపిణీ చేయడం, (౩) అస్సాం, బీహార్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలకు జనుము; జనపనార సరుకులపై ఎగుమతిపన్నులో వాటాలను కేటాయించడానికి బదులుగా చెల్లించవలసిన మొత్తముల నిర్ణయం; (౪) ఇండియా కన్సాలిడేషన్ ఫండ్‌నుంచి రాష్ట్రాలకు గ్రాంట్లు మంజూరు చేయడానికై అవలంబించవలసిన సూత్రాలు, (౫) రెండవ పంచవర్ష ప్రణాళిక అవసరాలకు అదనంగా ఆదాయాలను తెచ్చుకోడానికయి రాష్ట్రాలకుగల వనరులను దృష్టియందుంచుకొని సహాయక గ్రాంట్లు అవసరమయినట్టి రాష్ట్రాలకు ఎంత మొత్తములో గ్రాంట్లు ఇవ్వవలసింది నిర్ణయించడం; (౬) వ్యవసాయ భూములుగాక ఇతర ఆస్తులపయి ఎస్టేట్ డ్యూటీ రూపంలోవచ్చిన నికర ఆదాయాన్ని పంపిణీచేయడానికి అవలంబించవలసిన సూత్రాలు; (౭) భారతప్రభుత్వం ౧౯౪౭వ సంవత్సరము అగష్టు ౧౫ వ తేదీ లగాయతు ౧౯౫౬ మార్చి ౩౧ వ తేదీ వరకు వివిధ రాష్ట్రాలకు ఇచ్చిన అప్పులను తిరిగి

రాబట్టుకోవడానికి వర్తించవలసిన షరతులలోను, చెల్లించవలసిన వడ్డీ రేట్లలోనూ చేయదగు సవరణలు.

ఈ విషయంలో ఆసక్తిగలవారందరి అభిప్రాయాలను ఫైనాన్స్ కమీషన్ స్వీకరించి పరిశీలిస్తుంది. కనుక విజ్ఞప్తులను పంపదలచుకున్నవారు ౧౯౫౬ నవంబరు ౩౦ వ తేదీలోపుగా ఫైనాన్స్ కమీషన్ కార్యదర్శికి పంపుకోవలెను.

## ద్వి భాషా అక్షరమాల పటములు

హిందీభాష మాట్లాడని ప్రాంతాలలో నివసించేవారు, తమ మాతృభాషద్వారా త్వరగా, సులభంగా హిందీభాషను అభ్యసించడానికి వీలుకల్పించడానికై హిందీలోనూ, దేశంలోని ౧౩ ఇతర ప్రధాన భాషలలోనూ వివిధరంగులలో ద్విభాషా అక్షరమాల పటములను తయారుచేయించడానికి భారతప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖవారు తలపెట్టినారు. ఇట్టి పటములను సిద్ధంచేయు నభిలాషగల ప్రచురణ కర్తలందరూ ౧౯౫౬ డిసెంబరు ౩౧ వ తేదీలోగా తమ నమూనా పటములను అందజేయవలెను. ఈ విధంగా వచ్చిన పటములలో ప్రతిభాషలోనూ ఉత్తమమైనవిగా ఎంచబడిన మూడింటికి ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు ఇవ్వబడును. ప్రథమ బహుమతి రూ. ౫౦౦, ద్వితీయ బహుమతి రూ. ౨౦౦, తృతీయ బహుమతి రూ. ౧౦౦ లు.

---

## * కస్తూర్బా కేంద్రముల సేవ *

[౨౮ వ పుట తరువాయి]

అనేకమంది సేవికలు శిక్షణకొరకు మైసూరులోని సీతానగరం, కస్తూర్బా నగరం, అరాసికరే గ్రామానికి పంపబడినారు. అలహాబాదులోని సేవాగ్రాం కస్తూర్బా ఆసుపత్రి కమలానెహ్రూ ఆసుపత్రులలో మంత్రసానులు శిక్షణ పొందినారు.

గ్రామసేవ భవనానికి మరమ్మతు పనులు కొనసాగించడంలోను, హైదర్షా కోట్‌లో ఆటస్థలం, కాంపౌండుగోడ నిర్మించడంలోను, హైద్రాబాదురాష్ట్ర రిజర్వు పోలీసు యొక్క మొదటిదళం చేసిన 'శ్రమదానం' ఫలితంగా ఈ కేంద్రానికి ఎంతో సహాయం లభించింది. ఈ రిజర్వుపోలీసు దళం కేంద్రానికి సాంస్కృతిక కార్యకలాపాలలో కూడా సహాయపడింది.

కేంద్ర ఆరోగ్యమంత్రి ప్రతి కస్తూర్బా కేంద్రం కొరకై ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీనుంచి ౨౦౦ పౌనుల డబ్బాపాలను, పెన్సిలిన్, విటమిన్ మాత్రలను, ఇతరమందులను సేకరించారు. హైద్రాబాదు ప్రభుత్వ వైద్య ఆరోగ్యశాఖ కూడా ఈ కేంద్రాలకు పాలడబ్బాలు సరఫరాచేసింది.

కస్తూర్బా స్మారకనిధి చేస్తున్న సంక్షేమ కృషికి చాల డబ్బు అవసరం. ఈ నిధికి కేంద్ర సంఘ సంక్షేమ సంఘములు, బీదరు, నల్గొండ, రాయచూరు జిల్లా సంఘాలు, నిజామాబాదు పురపాలక సంఘం, హైద్రాబాదు ప్రభుత్వ సాంఘికసేవ, విద్యాశాఖలు, విరాళాల రూపంలో ఆర్థిక సహాయం చేశాయి. కొంతమంది వ్యక్తులు కూడా ఈ నిధికి ధనసహాయం చేశారు. అయితే ఇట్టి సంక్షేమ కృషిని భారీ ఎత్తున కొనసాగించాలంటే ధార్మిక ప్రజానీకం ముందుకు వచ్చి ఇంకా ఎక్కువగా సహాయపడాలి.



హైదరాబాదు వస్త్రపరిశ్రమ పనివారల మహాసభ *1956* జులై *29* వ తేదీన జరిగింది.
ఇది ప్రారంభసమావేశ దృశ్యం.

[దిగువ] వస్త్రపరిశ్రమ పనివారలసభలో శ్రీ వినాయకరావువిద్యాలంకార్ ప్రసంగించారు.



